శ్రీ

# ఇందులో-


| | | పుట |
|---|---|---|
| 1. | చైతన్యస్రవంతి | 1 |
| 2. | ఇంటాయన × ఐదు | 41 |
| 3. | వూడిన చక్రం-వాడనిపుష్పం | 58 |
| 4. | దాగిలిమూతలు | 66 |
| 5. | పశ్చాత్తాపంలేదు | 85 |


శ్రీ

శ్రీ

# ఒకటి రెండు మాటలు

ప్రపంచాన్ని పాలించేది పుస్తకాలే అనేది ఆంగ్లలోకోక్తి. ఇందులో కొంతనిజం లేకపోలేదు. అయితే అన్నిపుస్తకాలూ పాలిస్తాయా అని నిలవేసి కచ్చితంగాఅడిగితే "అన్నీ" అనివెంటనే సమాధానం చెప్పలేము. కొంతపరకాయించి సమాధానంచెబుతాము. అసలు ఈ పుస్తకాలనేవి ఎటువంటివంటే అయితే అమూల్యమైన నిక్షేపంగా ఉండిపోతాయి, లేదా మరునటి వారమే చెత్తకాగితాలలో కన్పిస్తాయి. అదంతా ఆ రచయితలనుబట్టి, వారి రచననుబట్టీ వుంటుంది. ఆల్డాస్ హక్స్‌లే కొత్త పుస్తకంవ్రాశాడని తెలియగానే ఏమిటోఅది అని ఎగబడుతాం. దీన్నిబట్టే పుస్తకాలవిలువ తెలుస్తుంది. కొత్తగావచ్చిన ఆతనిపుస్తకం చదివిన తరువాత పాఠకుడు చప్పరించుగాక, గాఢంగా అసంతృప్తిచెందుగాక, కాని మళ్ళీ ఓ సంవత్సరం తరువాత హక్స్‌లే దే మరో గ్రంథం వచ్చిందని తెలిస్తే మళ్ళీ ఆపాఠకుడే బుక్ స్టాలుకు తయారవుతాడు. అలాగే తెలుగు రచయితలలో బుచ్చిబాబు పుస్తకం వొచ్చిందంటే చూడాలనేఆరాటం నాలోనూ,ఇంకా అనేకమందితెలుగుపాఠకులలోనూ కలగడం సహజం. కారణం ఆయన వ్యక్తిత్వం అటువంటిది .చెప్పేవిషయమూ, ఆచెప్పేతీరూ అలాంటివి.దాన్ని చదివినతరువాత మనం పొందే అనుభూతి కూడా అలాంటిదేదో అయివుంటుంది. బుచ్చిబాబు ఇప్పుడు పాఠకలోకం ముందు పెడుతున్నపుస్తకం "చైతన్యస్రవంతి". పేరును బట్టే ఏదో విశేషంఉందని తెలుస్తూవుంది. తెలుగుసాహిత్యంలో "చైతన్య స్రవంతి" ఒకకొత్త పద్ధతి రచన. ఇంతకుముందు ఇలాంటివి అసలు రాలేదని చెప్పలేము. కొన్నివొచ్చాయి. ఒక నవలకూడా వొచ్చింది. అవి వేరు. ఇదివేరు. వాటికీ దీనికీ పరిమాణంలో పద్ధతిలో కొంతతేడావుంది.

ఇదిసరిగ్గా 36 పేజీలగ్రంధం. దానికితోడు మరోనాలుగు పేజీలవ్యాఖ్యానం. ప్రతి పుటలో పుట్‌నోట్సు కూడానూ. ఇదంతా ఏమిటి అని ఎవరైనా అడగవచ్చుననే రచయిత జాగ్రత్తపడి ముందుగానే వ్యాఖ్యానం వ్రాసుకున్నాడు. "క్షణికమైన ఒక అనుభవాన్ని మొత్తం జీవితానుభవంతో ముడెట్టి యీ రెంటి తారతమ్యాలు విభజన లేకుండా, వున్నది వున్నట్లు ప్రదర్శించే యత్నమే చైతన్యస్రవంతి" అని చెప్పాడు. ఎందుకీధోరణి అని అడిగెవారికి విభజనలో వడపోతలో సత్యందెబ్బ తింటుంది గాన వున్నదున్నట్లు మొత్తం అనుభవాన్ని చిత్రించాలి అన్న ఆదర్శం యీ ధోరణికిమూలం" అని వివరించాడు. ఇలాంటివి పాశ్చాత్యులలో వర్జీనియావుల్ఫ్, గెర్‌ట్రూడ్ స్టేన్, రిచర్డ్సన్ జేమ్సు, జాయిస్ మొదలైన వారువ్రాశారనీ, వారిపద్ధతిలోనే తానూ వ్రాశాననీ దాపరికంలేకుండా చెప్పుకున్నాడు. ఇక్కడే ఆయనకీ, మనలో కొందరు విమర్శకులకీ పేచీ వస్తుంది. పాశ్చాత్యులు వ్రాస్తే మనం అనుసరించడమేనా ? మనపద్ధతులు మనకు లేవా అని కొందరు వెంటనే దండయాత్రకుపక్రమిస్తారు. ఇలాంటి వారికి ఏంసమాధానంచెబుతాం ? అలాగని చెప్పకుండా వుండేదెట్లా ?

అసలు మనం ఎందుకు రచనలు చేస్తాం అని అంటే అందుకు సాహిత్యవేత్తలు నాలుగు కారణాలు చెబుతారు. ఒకటి భావవ్యక్తీకరణ. అంటే తన అభిప్రాయాలను ఎదుటివారికి చెప్పడంకోసం. రెండవది సోదరమానవుల చేష్టలపై, ప్రవర్తనపై మనకు గల ఆసక్తి. మూడవది మనం నివసించే ఈ లోకంపై మనకుగల కుతూహలం, దానికీ ఆంతరంగికంగా మన భావప్రపంచానికీ గల సంబంధ పరిశీలన; పోతే ఇక చివరి కారణం మనం చెప్పదలచుకున్నదాన్ని ఒకానొక పద్ధతిలో అంటే ఒక ప్రత్యేకమైన వాఙ్మయ స్వరూపంలో చెప్పాలనే మోజు. ఈ నాల్గవకారణం కేవలం fancy యే కాదు, ఒక ఆవశ్యకతకూడా. ఒక విషయాన్ని చెప్పడానికి ఒక ప్రత్యేకమైన వాఙ్మయ స్వరూపం మిక్కిలి ప్రయోజనకారి అవుతుంది. నాటకంఉంది.

నాటకంగా ఏదేని కధను చెప్పాలన్నా, (ప్రదర్శించాలన్నా,) దానికి కొన్ని పరిమితులున్నవి. ఆ పరిమితుల ప్రకారమే ఆకధను వ్రాయవలసి ఉంటుంది. అదే కధను నవలగా వ్రాయాలంటే ఇష్టమొచ్చినట్టు విపులీకరించి వ్రాయవచ్చు. నవలలో వచ్చిందంతా నాటకంలో రావడానికి వీలు లేదు. అందుచేతనే ఏ భాషావాఙ్మయంలోనైనా పద్యం, గద్యం, నవల, కధానిక, నాటిక, నాటకం ఇత్యాది స్వరూపాలన్నీ వొచ్చాయి. సాంకేతికంగా ప్రపంచం అభివృద్ధి చెందుతున్నకొద్దీ ఇంకా కొత్తస్వరూపాలు రావొచ్చు. రేడియో వచ్చినతరువాత శ్రవ్యనాటిక రూపొంది బహుళంగా ప్రచారంలోకి వొచ్చింది. టెలివిజన్‌లో కామెంటరీ, ప్రత్యక్షసంభాషణలు వుండవచ్చు. మరి తెలుగులో పూర్వం ఇప్పుడు వ్యాప్తిలో వున్నట్టి నవలలు, కధానికలు ఉన్నవా? మన మొట్టమొదటి నవల ఒకానొక ఆంగ్ల నవలకు అనుకరణమే కదా ! అయితే దాన్ని మనం సొంతం చేసుకున్నాము. అలాగే కధానికకూడా మన స్వంతమై పోయింది. విశ్వకధా సాహిత్యంలో తెలుగు కధానిక అగ్రస్థానం సంపాదించుకున్నదికూడా. అలాగేమిగతా వాఙ్మయ స్వరూపాలున్నూ. అసలు ఈ లలితకళలు ఎటువంటివంటే ప్రపంచంలో ఏమూల మొదట వెలువడినా వెంటనే వ్యాప్తి చెందుతాయి. మరోమూలవాళ్ళు వాటిని చూచి చదివి ఆనందించడానికీ, అలాంటివి తామూ ప్రయోగాలు చెయ్యడానికీ ఉత్సహిస్తారు. ఉదాహరణకు తెలుగువాళ్ళం వీధినాటకాలల్లో వున్నదశలో ధార్వార్ కంపెనీనాటకాలొచ్చాయి.వెంటనే మనదేశంలోకూడా వీధినాటకాలుపోయి మైలవరం కంపెనీ వొచ్చింది ఆనాటకాలతో కొన్ని రోజులు కాలక్షేపం చేశాము. తరువాత మూకీలూ,టాకీలూ వొచ్చాయి.నేటిసాంఘిక జీవితంలో సినిమా ప్రధాన వినోదంగా స్థిరపడి పోయింది. ఈ లోపల త్రీ డీ పి క్చ ర్సు వొచ్చాయి. కాని కళ్ళకూ గుండెకూ మంచివికాక పోవడంచేత అవి అంతగా వ్యాప్తిచెందలేదు. Panoramic Screen సి ని మా లూ, కలర్‌పిక్చర్సూ ఉల్లాసకరంగా ఉంటాయిగనక అవిస్థిరపడిపొయ్యాయి. అయితే ఈ ధోరణి ఇలా పోతున్నప్పటికీ మళ్ళీ నాటకకళను పునరుద్ధరించ వలెననే కోర్కె బలపడుతూ వుంది. అందుకు

కళాభిమానులు తగిన ప్రయత్నాలు చేస్తున్నారు.సాహిత్యంలోకూడా అంతే. మన ప్రాతిపదికను, వారసత్వాన్నీ పూర్తిగా కోల్పోవడం అవివేకమన్న మాటనిజమే. అలాగేమనదికాదు అని బహిష్కరించడం కూడా తెలివైన పనికాదు. ఏకళనైనా మనం పనిగట్టుకొని బహిష్కరించ నక్కరలేదు. అనభిలషణీయమైనదైతే దానంతటఅదే అంతరించి పోతుంది. ఆంగ్ల కాల్పనికోద్యమ ప్రముఖులలో బైరన్ మహాకవి ఒకడు. కొంతకాలం పోయినతరువాత చిన్నతనంలో తనకుకలిగిన శారీరక వైకల్యంవల్ల ప్రభావితుడై తన్నుతానుఏమిగానోగా ఊహించుకొని విపరీతమైన రచనలు చేశాడట. ముఖ్యంగా ఇటలీలోఉండగా. అవి నిలిచాయా? వాటిని చదివే వారెంతమంది? బైరన్ అనగానే ఆతని romantic Poetry యే మనకు చప్పున స్ఫురించేది. కాళిదాసు అంతటివాడే ప్రాచీనమైన ప్రతిదీప్రశస్తం కానక్కరలేదు, నవీనమైనప్రతిదీ నింద్యంకానక్కరలేదు, ఎందులోమంచి వుంటే దాన్ని రసజ్ఞులుగ్రహిస్తారు అని అన్నాడంటే ఆయనవివేచనాశక్తి విదితమవుతుంది. అసలు విశ్వసాహిత్యం అనేది ఒకటి బైలుదేరుతూ వుందని డంకన్ అనే విమర్శకుడంటున్నాడు. విశ్వసాహిత్యం అంటే నేను అర్థం చేసుకొన్నది ఇది: ఈనాడు ప్రపంచం వెనుకటి మాదిరిగా విభజితమై దూరమైలేదు. విజ్ఞానశాస్త్రాభివృద్ధివల్ల దేశాలూ, జాతులూ దగ్గరికొచ్చాయి. పర్యవసానంగా ఆయాదేశాలలోని సాంఘిక జీవిత విధానాలు మారిపోయాయి. ఏ దేశంలోని సాహిత్యానికైనా కొన్ని సమాన గుణాలు, ఆదర్శాలూ ఏర్పడుతున్నాయి. ఆ గుణాలకూ, ఆ ఆదర్శాలకూ కథావస్తువు వాస్తవికమైన మానవవ్యక్తిత్వం. దాని లక్ష్యం విశ్వమానవ సౌభ్రాతృత్వం. స్థూలంగా ఇటువంటి లక్షణాలుగలదే విశ్వ సాహిత్యం. ఈదృష్టితో చూచినప్పుడు "చైతన్యప్రవంతి"రచనాస్వరూపం ఆదరించదగిందిగానే తోస్తుంది. మానవవ్యక్తిత్వంయొక్క ప్రాముఖ్యాన్ని ప్రపంచం గుర్తిస్తే ఈనాడున్న ఈ గందరగోళమంతా తగ్గుతుంది. ఆవ్యక్తిత్వపు ఔన్నత్యాన్ని ప్రతిపాదించడమే నేటి రచయితలు చేయవల సినపని. అందుకు మొదటిమెట్టు ఈ రచనలో కన్పిస్తుంది. మనంబజారున పోతూవుంటాము. బజారులో కన్పించేవాటిని చూస్తూ, గమనిస్తూనే

పోతాం. ఇది బాహ్యావాతావరణం. పోతే, ఈ బాహ్యవాతావరణాన్ని మనం చూస్తూవున్నప్పటికీ, మన మనస్సు కేవలం వాటిపైనే వుండదు. ఏవో జ్ఞాపకాలు, అనుభవాల నెమరువేత, ఊహలు. వాంఛలు, భావాలు. భావపరంపరలు, ఇష్టాలు, ఏవగింపులు, కోపం, జాలి. సానుభూతి, తత్వం, తర్కం, ప్రయోగాలు, విజ్ఞాన చద్విలాసం - ఇదంతా మానసిక లోకం. ఈ రెండు లోకాలమధ్య వ్యక్తి జీవిస్తున్నాడు. ఈ రచనలో ఆ రెండు జగత్తులూ ఒక విశిష్టస్వరూపంలో చిత్రించబడ్డవి. సంస్కారం గలవ్యక్తి, అతని రహస్యమైన ఆలోచనలు, వాంఛలు, స్థూల జగత్తులో పదార్థాల ప్రేరణకి ఏవిధంగా అతను చలిస్తాడో, అతని మానసిక బాధలేమిటో చూపే ప్రయత్నం ఇందులో జరిగింది. మరి ఇదివ్యక్తినీ, జీవితంలోని చెడుగునీ బైటపెట్టి హేళనచేయడం కాదా అని ప్రశ్నించవచ్చు. హేళన చేయడంమాట ఏమోకాని అది ఆరోగ్య వంతమైన అధిక్షేపం. అది వ్యక్తిత్వంలోని బలహీనతలను చూపెట్టి హేళన చేస్తుంది. వ్యక్తిపడే యిబ్బందులను బహిర్గతంచేస్తుంది. వ్యక్తుల బుద్ధి వికాసమే సాంఘికకళ యొక్క ప్రయోజనం. చమత్కార స్వారస్యం, విజ్ఞాన పాండిత్యాలపై ఆదరణ, వ్యక్తి అంతరంగిక పరి శీలన - ఇవిపాఠకులలో పెరిగిన కొద్దీ "చైతన్యప్రవంతి" లాంటి రచనలకు మన్నన పెరగవచ్చు. పైగా ఈ సందర్భంలో పాఠకుడు గుర్తుంచుకోవల సింది మరొకవిషయంవుంది: తానుచదివేది వాఙ్మయ స్వరూపాన్నికాదు, వాఙ్మయాన్నే. అంటే జీవితప్రతిబింబాన్ని అన్నమాట.

ఈ సంపుటిలో బుచ్చిబాబు రచించిన ఒకస్కెచ్, మూడుకథలు కూడా వున్నవి. ఇవన్నీ ఇదివరకు పత్రికాముఖంగా వచ్చినవే. అయితే ప్రథమ పర్యాయంగా ఇలాపుస్తకరూపంలో వెలువడుతున్నవి. కథకుడుగా బుచ్చిబాబును పరిచయం చేయవలసిన అవసరం అంతగా లేదు. తెలుగు కథకులలో అగ్రశ్రేణికి చెందినవాడు బుచ్చిబాబు. ఈ విషయం ఆయన రచించిన ఏ ఒక్క కథనుచూచినా తెలుస్తుంది.

పైగా క్రమేపీ రచనాకళలో పరిణతుడై ప్రతిభావంతుడని అనిపించు కుంటున్న రచయిత. కథావస్తువును పట్టడంలోనూ, దానిని కళానుగుణం గా చెప్పడానికి తగిన రచనావిధానాన్ని అవలంబించడంలోనూ, ఊహా పోహాలలో, Sentiment లో, తాత్వికచింతనలో, వయ్యారంగా చెప్ప డంలో, లౌక్యంగా హాస్యం మేళవించడంలో, చివరకు భాషలో ఆయన పద్ధతి ఆయనదే. ఆయన స్వీకరించిన కథావస్తువు దారుణంగా వుందను కున్నా. ఒక్కొక్క చోట శృంగారాన్ని మితి మీరి వర్ణిస్తున్నాడనుకున్నా, చాలా దురుసుగా అభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నాడనుకున్నా, భాష ఏదో ఇంగ్లీషుధోరణిలో వ్రాస్తున్నాడని అన్నా, ఏమిటీ ఈయన చెప్పేది అని విసుగుకున్నా, ఆయన కథను మాత్రం చివరంటా చదవకుండ వుండలేము. చివరికి మిగిలేది ఏమిటీ అంటే చదువరుల సంస్కారం ప్రకారం వారు వారు పొందే అనుభూతీ, చేసే అవలోకనమూ.

సరికొత్త రచనలు తెలుగుపాఠకులకు అందజెయ్యాలన్న ఆద ర్శంతో పుస్తకాలను ప్రచురిస్తున్న ఆదర్శ సాహిత్యమాలవారు ఈ రచనను కూడా స్వీకరించి ప్రకటించడం ముదావహం. వారికినా అభినందనలు.

— డి. ఆర్.

హైదరాబాదు
ఆగస్టు, 1957.

# చైతన్యప్రవంతి

"—నన్ను ఇంటర్ వ్యూ చేసేటందుకు వీడెవడంటాను? వాడు-ఆదొర— దొరలుట- నలుగురుంటారట—దుష్ట చతుష్టయం— చతుర స్రమం గాళ్ళు— నే మనిషినంటే మనిషినీ, కోతినంటే కోతినీనా! వాళ్ళు వేసే ప్రశ్నలకి. వాళ్ళకో శ్మశానదహనము- అబ్బా, నాలిక మడతపడింది — వాళ్ళకో సమాధానం తెలిసేడిస్తేగా!

'నీ పేరు' ?దరఖాస్తులో తగులడిందిగా. 'ఇందులో ఎందుకు చేరతావు ?'— ఎందుకేమిటి ? వాళ్లంతా ఎందుకు చేరారు ? చేరు-చెరచెరా — చెరుపు - చెర్రుమంటుంది — ఇదంతా ఒక చెర, జైలు, బందిఖాన, ఈ సంసారము సంఘంలో ఒక చెరసాల - ఈ సంఘం దేశంలో ఒక జైలుగది; ఈ దేశం ప్రపంచంలో ఒక, మూరు మూల చీకటి గది. ఈ ప్రపంచం విశ్వంలో అబ్బే! గోళికాయంతండి. — సూర్యుడు గోళికాయంతైతే, భూగోళం ఇసుకరేణువులో వెయ్యోవంతు. ఈ విశ్వంలాంటివి మరెన్నో [1] పలోమార్లో వున్న భూతద్దానికి అగపడవట. ఎన్నెన్నో గోళాలు, విశ్వాలు, అనంత శూన్యంలో మాతమ్ముడు వూదిన రబ్బరు బుడగలాగ పెరిగిపోతున్నాయి. దీన్ని ఊదిన వాడెవడు [2] ? ఎప్పుడో బ్రహ్మగాడి అంకెళ్ళు పడతాయి. టి. బి. క్రిములు చేరి వాడిలంగులు పడతాయి. రబ్బరుబుడగ తప్పు

---

1 నేటిఖగోళ శాస్త్రజ్ఞుల నిర్వచనాలు. పలోమార్ నిర్మాణమైన పెద్దదూరదర్శినిద్వారా దూరంగావున్న ఎన్నో గోళాలను చూపించగలుగుతున్నారు.

2 ఖగోళ శాస్త్రజ్ఞుడు స్పెన్సర్ జోన్స వేసిన ప్రశ్న.

మంటుంది.[1] వాడడుగుతాడు - ఎర్రకొండమీద ముప్పై రెండు గుర్రాలున్నాయి. టప్పుమంటే నిలిచిపోతై, ఏమిటిచెప్పు -?[2] పళ్ళురా, పళ్ళు. వాడిపెళ్ళాం గరిటితో కొట్టగా వూడకుండా మిగిలిన ముప్పై రెండు పళ్ళు – ఆ – ఇప్పుడు తెలిసిందా? నేనెందుకు చేరతానో ఈ చెరలో? పావ్‌లావ్ కుక్క[3] లాగా పొట్టకూటికి గుండ్రని ఎముకని చూపిస్తే వాడిచెయ్యి నాకుతా, వాడిపెళ్ళాం కాళ్ళు పడతా, ఛీ ఛీ. ఫ్రాయిడ్[4] తాతయ్య నూరిపోశాడురా, వాడిపెళ్ళాం గొడవ నాకెందుకు? వాడికాళ్ళే పడతా ఫ్రేజరు

---

1 జేమ్సుజీన్స్. "సూర్యుడు వేడిని గోల్పోయి, సన్నగిలి కొవ్వొత్తి లాగైపోతాడు. ఇది జరక్కముందే మన భూగోళం మీద ప్రాణులన్నీ నశింపవుతాయి. ఇదంతా కొన్ని కోట్ల సంవత్సరాల మాట." ఈ సిద్ధాంతాన్ని కొందరు ఖగోళశాస్త్రజ్ఞులు అంగీకరించరు.

2 చిక్కుప్రశ్న.

3 పావ్‌లావ్-రష్యన్ మానసిక శాస్త్రజ్ఞుడు. కుక్కలపై పరిశోధనలు చేశాడు. పాలు కుక్కముందు పెట్టి తుపాకీ మోగిస్తాడు. ఆ తుపాకీ మోతని పాలు త్రాగడంతో ముడెట్టి, పాలు లేకపోయినా, తుపాకీ మ్రోగగానే, కుక్కలో జఠర రసం ద్రవిస్తుంది. మనిషి ఆలోచనలు చర్యలు బాహ్యజగత్తులోని 'ప్రేరణలకు' సమాధానంగా భావించాలి గాని, వాటిని అతిక్రమించే వ్యక్తిగతమైన కార్యశూరత్వం, ఆత్మ బలం లేవంటాడు డాక్టర్ వాట్‌సన్. ఈ సిద్ధాంతాన్ని 'బిహేవియరిజమ్' అంటారు. ఆత్మకి, మనస్సుకి, తత్వజ్ఞులు ఆపాదించిన గౌరవాన్ని కూలద్రోస్తుందీ సిద్ధాంతం. దీన్ని యీనాడు అంగీకరించడంలేదు.

4 ఫ్రాయిడ్ - మానసిక శాస్త్రపరిశోధకుడు. సెక్సుకి ఆకలికీ సంబంధం, ఆ సంబంధాన్నుండి జనించే 'నటన' బాల్యంలో స్థిరపడి పోతాయని దానికి ఉదాహరణలు చూపుతాడు.

[1] (Frazer) 'బంగారు బొమ్మ' లో వెనక ఈజిప్టురాణి వెన్ను నాకేటందుకు ఇద్దరు సేవకులు ఉండేవారని వ్రాశాడు. [2] ఇది చదివి నాలిక కొరుక్కున్నారు. అయిదువేల కాపీలు [3] అమ్ముడయ్యాయి. ఈ దేశంలో? దినవారం [4] పత్రిక — లేకపోతేను! - దిన, వారం మాసికం సంవత్సరీకం పత్రిక ఒక్క కాగితాన్ని ఐదు వేలమంది ముక్కలు క్రింద కొరుక్కు తింటారు. పదివేల మంది పెళ్ళాలు - అంటే జుంగు [5] (Jung) గాడుచెప్పినట్లు ప్రతి మగాడికి ఒక పెళ్ళాం ఒక ప్రియురాలు — మొత్తం ఎంతమంది? పదివేల మంది. దానితో [6] పొయ్యి రాజేస్తారు. అందుకని, గుండ్రని ఎముకనిస్తే ఆపనిచేస్తా. ఎక్స్‌ప్రెస్! ఎక్స్‌ప్రెస్! హిందూ, హిందూ, దక్కన్

---

1 ఫ్రేజర్ - ప్రాచీన మానవుడి మనస్తత్వం, ఆచారాలు, మూఢనమ్మకాలు శోధించి, నాగరికుల ప్రవర్తనకి కారణాలు వాటిమీద ఎంతవరకూ ఆధారపడ్డాయో 'గోల్డెన్‌బౌ' (బంగారుబొమ్మ) అనే గ్రంథంలో చర్చించాడు. బొమ్మ బొమ్మైంది.

2 ఈ కథ 'హేవ్‌లాక్ ఎల్లిస్'' సెక్సు గ్రంథాలలోనిది. ఈనాడు సెనిమాలలో శృంగార ఘట్టాలవల్ల కలిగే జుగుప్సకి మారుగా, వెనక రాజులు, రాణీలు యీవిధంగా కామోద్రేకాన్ని పొందేవారుట.

3 కాపీలు - మనస్సు కాఫీమీదికి వెడుతోంది కాబోలు - ఎదురుగుండా హోటల్ని చూడగానే.

4 దినపత్రిక, వారపత్రిక-ధ్వనుల మేళవింపు.
సంవత్సరీకం పత్రిక - సంవత్సరాది సంచిక.

5 యూంగ్ - మానసిక శాస్త్రి తత్వజ్ఞుడు. భార్యవుండగా, ప్రతి పురుషుడూ మరో స్త్రీని లోలోన ఆరాధిస్తూంటాడని.

6 దానితో - పత్రికతో.

క్రానికల్ దక్షిణాదికార బంకల్ [1] బస్సురాదే-టైము ఎంతయింది? సుష్మత్నే ? సమాధానం చెప్పదేం? ఆగిపోయిందా.? బోష్మ్ర గడియారమా? మామగారు చేతి గడియారం ఇస్తానని ఐదు నెలల నుంచి ఊరంతా యాగిచేస్తున్నారు - అత్తగారు - తైతక్కతై. తధన దోం. తత్తతత్త తధన దోం [2] అపొద్దు — నంజన్‌గూడు పళ్ళపొడి వారణా సాత్కుడి ఆరంజి పత్తణా టూత్తుకూడి షికాయిపొడి. అరవై నాలుగు నయా పైసాలు. [3] చెప్పు లెక్క అణాల్లో చెప్పు. అదుగో బస్సు, డబుల్‌డెక్కరు. జంట జగత్తు - మొగుడు పెళ్ళాం - రాత్రి పగలు- పట్నం పల్లె - రాగద్వేషాలు — టైములేదు — పుట్రణం- [4] అత్తగారదొడ్డు గోడగడియారం గోడకు తగల్చండి అప్పుడు ఉద్యోగంలో - 'దూరంగా నుంచో' [5] క్లార్కు గేబుల్, మిర్నాలాయ్ మ్యాట్నీ కెళ్ళాలి. లోపల సిగరెట్లు తాగనివ్వరు - మిర్నాలాయ్ ముక్కుపతుల టొంపముక్క ముక్కుల చోకారముల్లా ఉంటుంది ఎక్కడదిది- మొల్ల రామాయణం — గొల్లకలాపాం. చల్లనమ్మబో యే వేళ.

---

1 రాచపుండు - క్రానికల్‌లో శబ్దక్రమంకోసం వాడినది.

2 అల్లుడికి రిస్ట్‌వాచీవొద్దు, గోడ గడియారం యిమ్మంటుంది అత్తగారు - నలుగురూ చూస్తారు; భర్త అంగీకరించక పోతే కోపం 'తైం' యిమ్మని, చేతులు, మొహ తిప్పుకుంటూ మీదికి వెళ్ళినట్లుగా ఊహించుకుంటే, భరతనాట్యం భంగిమాలు స్మరణకొచ్చాయి కాబోలు.

3 'పైసేలు' అనుండాలి బహువచనం గనక.

4 పుట్రణం = పుట్టుక, మరణం. ద్వంద్వాలు, టైములేక వొకమాటగా కలిపేశాడు.

5 దూరంగానుంచో - వొక ఇంగ్లీషు టాకీ చిత్రం పేరు. అందులో ప్రధాన నటులు. క్లార్క్ గేబుల్, మిర్నాలాయ్-వాల్ పోస్టర్ చూశాడన్నమాట.

ఇల్లలికే అప్పమ్మ[1] దాని బుజాలికి నొక్కి వాడి పెదవుల బూజును తుడుచుకుంటాడు. ఎంత ధన్యుండోకో[2]! ఖూని చెయ్యమంటే సిద్ధం అదిస్తే[3] - ఖూనీ వివరాలు వొచ్చేవారం చదవండి సం॥[4] షెర్లక్ హోమ్స్ ఆగతా క్రిస్టీని పెళ్ళి చేసుకున్నాడు.[5] అట్లీకి, రస్సెల్‌కి, క్రిష్టి కలలేఅటగా![6] నో, నో. - 'అగాతా' మనిషి—[7] ఎముకల కుప్ప- పదునైన మాంసపు ముద్ద- సంధ్యా రాగంబువోలె నయాగరావోలె మిల మిల ప్రవహించే రక్తాశయం. ఆమె యవ్వనంలో మృత్యువంటె తెలియని మనోహర మధురమూర్తి- షెర్లాకో మరి?[8] క్యావాట్సన్?[9] షెర్లాక్ అచ్చు మనిషి. 'ప్రింటర్స్ డెవిల్' - దేర్ ఫోర్ కాబట్టి, అది[10] ఇస్తే మతం వదులుకుంటా - అసలు నాకుమతం ఎక్కడేడిసింది? ఏమిటి మతం? దరఖాస్తుతో

---

1 అర్థంలేదు - ఏ స్త్రీఅయినా పనేవాలేను కాబోలు.

2 ఆమెతో నటించిన నాయకుడనా?

3 అది,= ఉద్యోగం.

4 సీరియల్ నవల. సంపాదకుడు చెప్పినది.

5 అగాతా క్రిస్టీ- అపరాధ పరిశోధక నవలా రచయిత్రి.

6 అట్లీ - మాజీ బ్రిటిష్ప్రధాని. బెర్ట్రండ్ రసెల్ సుప్రసిద్ధ ఆంగ్ల తత్వ శాస్త్రజ్ఞుడు; సాహిత్యానికి నోబెల్ బహుమతి పొందిన రచయిత. వీరిరువురూ, కాలక్షేపానికి, క్రిస్టీ నవలలు ఎక్కువగా చదువుతారుట.

7 అగాతా క్రిస్టీ చిన్నప్పుడు ఎట్లా వుండేదో వూహించుగుంటూ-

8 కోనన్ డాయిల్ రచించిన అపరాధ పరిశోధక నవలలో డిటెక్టివ్ షెర్లాక్ హోమ్స్.

9 అతని మిత్రుడు డాక్టర్ వాట్సన్.

10 ఉద్యోగం.

జతచేసి పంపిన జంధెం [1] "ప్రాచీన మానవుడు చీకటికీ, భూకంపానికీ, తుపానుకీ, పసిపాప జననానికీ, వృద్ధుడి మరణానికీ హడిలి, బెదిరి,హడిడి బెలిరి - [2] - పారిపోయి రాయి వెనకా, చెట్టుమీదా దాక్కున్నాడు. సూర్యుడికి నమస్కరించాడు - అవే దేముళ్లు, అవే విగ్రహాలు- వాడి మనమలు మునిమనమలు వాటి వెనకే దాక్కుంటే వాళ్లందరూ చూపే, భయానికి 'మతం' అని పేరు" ఎక్కడిదిది? విలియమ్ జేమ్స్ [3] దీనికేం చెబుతాడో రాధాకృష్ణన్ [4] ఉత్తరం వ్రాసి కనుక్కోవాలి. కండక్టర్ చోటు లేదని చెయ్యి వూపుతున్నాడు. మంచిగంధపు చెట్టు మ్రానుని పట్టుకుని వేళ్లాడుతున్న పాములలా బస్సు కడ్డీలు పట్టుకుని వ్రేళ్లాడు తున్నారు-లాయర్లు ప్రొప్రయిటర్లు, నిరుద్యోగులు,స్కూలు మాస్టర్లు,[5] రోడ్డు డస్టర్లు,శాస్త్రులవారివి స్త్రీలు [6], ఆలీశాస్త్రమిడ్జో జోజో నాముద్దుల పాప పిస్తోళ్లు [7]-టిక్కెట్లువూరికే

---

1 ఒక బ్రాహ్మణ నిరుద్యోగి. తను బ్రాహ్మణీకం వొదులుకొన్నా ననీ, చెప్తూ, ఉద్యోగానికి దరఖాస్తుతో పాటు జంధెంకూడా పంపాడని యస్. వి. వి. అనే తమిళ హాస్య రచయిత ఆంగ్ల వ్యాసంలో వ్రాశాడు.

2 అర్థంలేని ధ్వనుల ఫిరాయింపు.

3 అమెరికాదేశపు తత్వజ్ఞుడు,- 'వివిధ మతానుభూతులు' ప్రసిద్ధగ్రంథం.

4 ఆధునిక విజ్ఞాన శాస్త్రానికి అతీతమైన మూలకారకుణ్ణి ఆధ్యాత్మికంగా సాక్షాత్కారం చేసుకోవాలి కాని, తార్కికంగా అన్వేషించటం అజ్ఞానమని డాక్టర్ రాధాకృష్ణన్ నిర్వచనాలు.

5 స్కూలు మాస్టర్లు అనుండాలి. ఆ సమయంలో ఏదో గోడమీద పోస్టర్ చూశాడు కాబోలు.

6 శాస్త్రులుగారంటే, విస్త్రీళ్ళు జ్ఞప్తికి వొచ్చినట్లున్నాయి.

7 ఇండోనేషియా ప్రధాని. 'కొరియా' తగాదాలు స్మరణకిరాగానే, యుద్ధం, పిస్తోళ్ళు-మధ్యలో జోలపాట.

పోకుండా స్త్రీ వెంటపడే కళాశాల సౌందర్య పిపాసులు- కాళిదాసు మెచ్చుగుంటాడు - మంచి గంధం పరిమళం మాత్రంలేదు - కరింబీడీ వాసనలో మిళితమై ధారకిందకారి, - భూగోళం వెయ్యి సంవత్స రాల క్రితం ఎట్లావుండేదీ- [1] కంగళ్లర్ కోటుని డాగుపరిచిన చెమట చుక్కల ధారపరంపరలు- యిది మా నాగరికత, కాళిదాసు కేం తెలుసు? "ఇది అన్యాయం. నువ్వు నా కాలంలో అధమ విషయాలను నా మేఘసందేశంతో పోల్చి నువ్వు అన్యాయం చేసుకుంటున్నావు" నోనో కాదిళాసు.

స్టుడియోలో సుప్రసిద్ధ అల్లారుముద్దు, మిస్ ఈస్ట్, మిస్ వెస్ట్, ఈస్ట్‌వెస్ట్, ఇంటర్నేషనల్ తెర తార-షెలింస్టార్ బుజాలకింద గౌనుకి పడే డాగులూ అంతే- సేమ్. వాటిషేమ్ ఇన్ని సౌందర్య నిర్మాణ కార్మాగారాలు, పారిస్‌లో షాంప్ ఎలి సీస్, [2] మూంట్ పర్నాసి, [3] కోటే, [4] యార్డ్లీ - నెయ్యి ఇడ్లీలో [5] ఎక్స్‌ట్రా- మాక్స్‌ఫాక్టరీ [6] మార్క్స్ థీరీ ఆఫ్‌లావు సర్‌ప్లస్ వాల్యూ-[7] యిన్నికలిసి చెమటని అరికట్టలేవే! "స్త్రీ పురుషుల చెమటకి. చక్కదనం, సువాసన, మందం - ఘనసాంద్రత- పాటుపోట్లు, ఫ్రీక్వెన్సీ, సమం

1 కొన్నివేల సంవత్సరాల క్రిందట భూగోళం మాప్ వేరుగావుండేది.

2 పారిస్‌లో విహారస్థలం.

3 పారిస్‌లో.

4 సుగంధద్రవ్యాలు. సౌందర్య పరికరాలు తయారుచేసే కంపెని.

5 కొన్ని హోటళ్లలో.

6 మాక్స్‌ఫాక్టరీ - మేకప్ సామాన్ల తయారీసంస్థ.

7 కారల్‌మార్క్స్- శరీరంలో అధికంగా కొవ్వుపెరిగి లావెక్కితే తగ్గించే మందులున్నాయి. వస్తువు తయారీకైన ఖర్చుకిమించిన విలువ. కొనుగోలుతో పెరుగుతూంటుందని వారి ఆర్థికసూత్రం.

- అన్ని కాలాలలోను, అన్ని స్థలాలలోనూ- జె. బి. యస్. హాల్డేన్ [1] అంటాడు.

“అట్లాగైతేనాదుష్యంతుడూ అంతే” కాళిదాసు మెచ్చుగోడు.-

జోళ్లరిపేర్స్. పాడునాకాళ్ల కేసేచూస్తాడు. వాడిబ్రదుకంతా అంతే. పాదాలశిల్పి. కాళ్ల కేసే చూసిచూసి వాడి మెడ బిగిసి మరిపైకి లేవదు- టెటనస్ [2] “అబ్బే-వృత్తికి సంబంధించిన జబ్బు. -డాక్టర్ దినకర్. మొహంపైకెత్తు-నాలిక కింద ధర్మామీటర్ పెట్టాలి. అబ్బేలేవదు. అంతే ( మీజోళ్లకి పాలిష్ వేస్తా ) ముత్యంలా మెరుస్తుంది. “నీకు జబ్బురా, మందివ్వనీ ”(ముందు తాళ్ళు విప్పనివ్వండి) వాడిబ్రదుకంతే. డిమాక్రసీట. జోళ్లపనివాడి దుకాణం రోడ్డు లెవెల్ కంటె కిందుగావుండాలి. అప్పుడు రోడ్డు మీద వెళ్లేవాళ్ల కాళ్లుఎత్తుగా కనిపిస్తాయి. అప్పుడు వాడి తలపైకి నిలబడుతుంది” రష్యన్ మనస్తత్వవేత్త, జకావ్‌సిపిల్ పాలిష్‌స్కీ [3] ముగ్గురు లాయర్లు మాత్రిమూర్తి [4] చోటు లేక కడ్డీవొదిలి రోడ్డుమీద పడ్డారు,- రోడ్ డామేజ్-డిఫమేషన్ సెక్షన్ కోల్ టార్ సిమెంట్-ఏనుగు వీపుమీద పడిన పుండు మీద వాలిన యీగలమాదిరి — ఏనుగు కాదు—వొంటి - మధురవాణి లొటిపిట,[5] చెటపట, ఛమడిపాటి కచట తప — అండమాన్సులో నీటికుండని అంటి పెట్టుకుని వున్న ఖైదీల

1 జీవశాస్త్ర పరిశోధకుడు.

2 అనేక ప్రమాదకరమైన వ్యాధి.

3 అల్లాంటి వ్యక్తి లేడు. జోళ్లపనివాడి జబ్బుకి మందు సూచించింది లెనిన్ అని లైసెంకో వ్రాసినట్లు ఎక్కడచదివాడో జ్ఞాపకంరాక, పేర్లని కలగాపులగం చేశాడా?

4 ఎలిఫెంటా గుహలో త్రిమూర్తి విగ్రహం.

5 కన్యాశుల్కంలో, మధురవాణి ఉత్తరం చదవడం- నవ్వడం, గ్రామ్యం జ్ఞాపకానికొచ్చి.

ఎండిన పెదవుల మాదిరి - హాయ్ హాయ్! ఎలెక్షన్స్‌లో నాకు మెజారిటీ వోటు తప్పదు. అదిగో బస్ - వుడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్‌ని [1] మోసుగొస్తోంది. వెనకాల కాన్వెంట్ గరల్స్ బస్సు. వాళ్ల జడలు మంచి గంధపుచెట్టు ప్రమానుకి వ్రేళ్లాడే త్రాచు పాము పిల్లలు — [2] "నాచుట్టు పూర్ణచంద్ర ప్రభాపీఠికలు విరిసినవి క్షీరసాగర తరంగములట్లు" [3] "అలసముగ సాగు జ్యోత్స్నాభిసారికల పయ్యెద తుదలు కన్పించె నదులేమొ యన్పించె."

యవ్వనంలో బంధించబడ్డ ఆకన్యలని నాగరికత బస్సులో బంధించి కాన్వెంట్ అనే జైలుకి మోసుకు పోతోంది. కుటికురా, పెట్రోల్, గాసొలైన్. ఇక్స్లస్. మెల్‌టాక్స్. [4] త్రికోణ ప్రేమతత్వజ్ఞులు, ఎలక్ట్రాన్, న్యూట్రాన్ - పిడబ్బ సైక్లోస్ట్రాన్ - ఇవన్నీ ఆ యవ్వనాన్ని కదుపుతున్నాయి. చైన్ రియాక్షన్ - [5] కార్బన్-హైడ్రోజిన్ - వొక్కడికి చోటుందా? ఉందా? రైట్. ఎక్కుదాం. ఎక్కుతున్నాను. ఎక్కాను. అమ్మయ్య, జాకోబ్స్ లాడర్, [6] నిచ్చెన స్వర్గానికి మెట్లు, రంభకుచద్వయశిఖరం - నిలబడి కడ్డీపట్టుగుంటా - వొదలకూడదు. వొదిలితే, పడి మోకాలు చిప్పవూడొస్తుంది. అల్లా వుండేటందుకే ఆమోకాలు చిప్ప అమర్చబడింది. - [7] పనిమనిషి మోకాలు - అనేజబ్బు - నాగరికత మాట్లాడుతోంది. అరవం. తుర

---

1 ఇంగ్లీషు మందు ఎడ్వర్‌టైజ్‌మెంట్ పోస్టర్.

2 & 3 సి నారాయణరెడ్డి. 'స్వప్నభంగం' కావ్యంలోనిది.

4 ఆధునిక భౌతికశాస్త్రంలో, విభజింపబడిన సూక్ష్మ పదార్థాలపేర్లు.

5 ఎటామిక్ సిద్ధాంతంలోనిది.

6 క్రైస్తవ పురాణ గాథలో "జాకబ్" నిచ్చెన.

7 వ్యాధి పేరు.

కం, నరకం,[1] గుజరాతి లజపతిరాయి, మహారాష్ట్రి వ్యవస్థీకరణ, కన్నడ కాన్పుసమయపు ఆవేదన. తెనుగు నుడికారం పిలక -, అమెరికా ముక్కుధ్వని, ఆడమళయాళం కేరళసబ్బు - నాగరికతకి వాక్శుద్ధి లేదు. భాషా విచ్ఛిన్న సంకర సమీకరణ సంకలనం - నా నెత్తి-

వాక్యసమాసం సరిగ్గా రాదు చిన్నయ్యసూరి పుట్టి చచ్చినందుకు తార్కాణ నాభాషా పరిజ్ఞానం,[2] పిడుగు రామమూర్తికి మారుమ్రోత నానోట కుంటిధ్వని - స్కూలుమేష్టర్ పాగా పాతది- పాగా తీయవయ్యా, — దానికింద ? నమస్తే ఎమ్. ఏల్. ఎ. జీ - టోపీ తియ్యండి. దానికింద? హల్లో హెడ్ క్లార్క్ హాట్ తియ్యి. దానికింద? సిమెంట్ కాంక్రీట్ చప్టా-

గుండ్రనిపముకకోసం ఆకాసినితెల్లపెంద్రుకల్నిమెుక్కుకున్నారా మీరలు ? జేబులో తాంబూలం, పుగాకు, జర్దా, లాల్చీవ్యక్తి కంప్యూనిస్టు - 'అన్ని దేశాలలోని పనివాళ్లు, మజుదూర్లు. ఏకంకండి[3] కారల్ హోక్స్— [4] హాచ్ - తుమ్ములు. సిగరెట్టు కాల్చడానికి వీల్లేదు. ఎంచేత ? బస్సు తగులడుతుంది. పాపం పా రే శా డు. అణా సిగరెట్ - చార్ మినారైతే, అణాలో పదోవొంతు - బస్సు తగులడితే ఖూస్వాముల ప్రపంచంలో కొంత ధనం నశింపు - మంచిదే.

---

1 మాటలు, ధ్వనులు, కిలగాపులగం.

2 గిడుగు రామమూర్తి.

3 కారల్ మార్క్స్ ప్రచారంలోకి తెచ్చిన నినాదం. ' అన్ని దేశాల లోని పనివాండ్రు, ఏకంకండి.'

4 హోక్స్ = బూటకం. మార్క్స్‌వాదం- భౌతిక శక్తులు చరిత్రకి వెన్నెముక- అన్నదాన్ని చరిత్రకారులు. వీరిలో ముఖ్యులు స్పెంగ్లర్, టాయిన్ బీ.

టికెట్, టికెట్ - పిక్ పాకెట్ - ఫేజ్ ? న్యాసా - నయపైసా' మల్లా" ఆగింది బస్. ఏరుంగో - క్రాస్ రోడ్. దిగండి. గెటవుట్ - నేనెక్కడ దిగాలో చెప్పు. ట్రాన్సిగరల్స్ నక్లీ - * కె. కె. ఇంగువ[1] వాడండి[2] సముద్రగుప్తుడు వాడేవాడు. టంగ్, టంగ్ - కిర్ కిర్ - విజిల్. చెవుల డప్పులు బ్రద్దలవుతాయి. అశోకుడి పొక్కపొడి వాడండి - బౌద్ధ సన్యాసులుగా అవుతారు. ప్రక్కన అరవసోదరుడు సుగమ సంగీతం ప్రారంభించాడు. నగుమోముగనులేవి?-చెంబెయ్యాంగుడి టప్పమ్మాళ్ 3 ఉస్తాద్ అల్లావుద్దీన్ రుక్మిణీ దయశంకర్-మొహాలు, సన్నవి, పొట్టివి,- ఆధునిక శిల్పకళామొహాలు - ముక్కు- కిందగొయ్యి - అటూయిటూ రెండు గోతులు - అన్నీకంఘలు, గోతులు, మధ్యదూలం - బ్రహ్మ చేస్తున్నప్పుడు, బేసిక్ వాల్యూస్ యివే - స్థూలమైన ఆకృతి. అస్తి పంజరం. — ఎబ్‌స్ట్రాక్ట్ ఆర్ట్. 4 అయోమయానికి అతీతమైన చిత్రలేఖనం. - పమిట జారితే కనబడేది వొకటే. రెండోది కనబడదు. 5 ఆ బొమ్మలో రెండోది లేదు. గవర్నర్ గోల్డ్ మెడల్ అందుకుంది

---

1 నీళ్లతో నిండిన స్థలం.

2 ఇంగువ ఎడ్వర్‌టైజ్‌మెంట్.

3 చెంబెయ్ వైద్యనాథభాగవతార్, శెమ్మంగుడి శ్రీనివాసయ్యర్, శ్రీమతి పట్టమ్మ, అల్లావుద్దిన్‌ఖాన్, శ్రీమతి రుక్మిణి అరుండేల్, ఉదయశంకర్ - గాయకులు, నర్తకులు, పేళ్ళ కుదింపు.

4 ప్రకృతికి అతీతమైన ఆధునిక కళ - శిల్పాలు, చిత్రపటాలు- వాటి వర్ణన. ప్రకృతిలోను ప్రధానమైన ఆకృతిని తెలుసుకుని చిత్రించాలి అని ఆదర్శం- గణిత శాస్త్రంలోని సున్నాలు, కోణాలు, చదరాలు. అన్ని వొస్తువులనూ యీ స్వరూపాలతో ముడిపెట్టొచ్చు.

5 ప్రక్కకి తిరిగినప్పుడు కనబడేది వొకటే.

అంటే రెంబ్రాండ్ది కాదు లెండి. [1] పాల్ క్లీ, మాక్స్ ఎర్నెస్ట్, పాబ్లో బాబో పీకిపిసుకో - చాగల్లు - ఛఛ - మార్క్‌చాగాల్.- జైమినీ భారతం రోయ్! [2] నగుర్పాటుకి రోమాలు లేచి నుంచుంటాయి- బాల్డ్ హెడ్ అయితేనో? రోమ్‌లో వొక చిత్రకారుణ్ణి వొకాయన అడిగాడుట 'నీ బొమ్మలు యింత అందంగా వుంటాయి- నీసంతానం అంత వికృతంగా వుంటారేం"?

"సంతానం చీకట్లో సృష్టి- బొమ్మలు వెలుతురులో"- వింత వింత ధ్వనులు- దుస్తులు, రేయాన్, నైలాన్, ఐ బుషీలినెన్, [3] సిల్కి ట్రాన్ - [4] హాండ్‌బూమ్ - [5] షిఫ్ఫాన్ - జార్జ్ సిక్స్‌తెట్టి, [6] వెల్‌వెట్ వివియన్‌లై బ్యూటీ- [7] ఖద్దరు వస్త్రధారీ మురారీ, మోకాలు దాటగలదా? [8] అది గడియారాల బుష్‌షర్ట్- [9] అజ్‌టెక్

1. గోల్డ్‌మెడల్ ఆ కనబడని రెండోదానికి కాదు, చిత్రానికి- అని.

2 ఆధునిక చిత్రకారులు. పాల్ క్లీ మాక్స్ ఎర్నెస్ట్, పాబ్లోపికాసో (బాబో ఎందుకంటే, యీయన రోజ్ పిరిడ్‌లో ఎక్కువగా ఎరుపు రంగులు వాడాడు)

పీకి పిసుకో- భీభత్సం- వొస్తువు. చాగల్లు- చాగాల్. (చిత్రకారుడు). జెమినీరాయ్. చిత్రకారుడు

3 ఐర్లండ్ దేశంలో తయారైనబట్ట.

4 సిల్కు + నైలాన్ ప్లాస్టిక్స్.

5 హేండ్‌లూమ్

6 జార్జెట్.

7 వెల్వెట్.

వివియంలే-ఫిలింతార

8 మీరజాలగలడా సత్యాపతి - పాటవరస

9 అజ్‌టెక్ - వొక ప్రాచీన నాగరికత. కోతులు, పాములు, పిట్టలు, శిథిలాల చిహ్నాలు - కొన్ని బుష్‌కోట్లపై యీ రకం చిత్రాలుంటాయి.

నాగరికత చిహ్నాలు పాములు- ఆపాముల బుష్‌కోతి. వాడి తెల్ల గెడ్డం దశరథుడు- వీడిజుట్టు, వాల్మీకి జప- లాలాజీ లాంగ్రడీనుంచి వచ్చిన ఆ లా కాలేజి విద్యార్థి హైలామ్యాం చూడండి- మరి వీడో- వీడి చేతిలో బాగ్- ఎంతలావో- బాగ్ కాదు. ఎంతలావంటే,- వాడినీడ ఆ లాకాలేజి పిల్లాడి మీద పడిందంటె ఆపిల్లాడు క్షణంలో చస్తాడు- ఆబాగ్‌లో వోట్లు- నోట్లు- ఎన్నో? [1] నగరాజు ధరలు నేపూ- ఇన్‌ఫ్లేషన్ స్పైరల్- [2] వొంకరలు తిరిగే మెట్లు- మునిరి- [3] పిలకూడు తుందిరా- మళ్ళా నిలిచింది. పుట్టడం, కదలడం, విజృంభించడం, చిక్కటం, చీలడం, విధ్వంసం కావడం.- అది నాగరికత చరిత్ర అంటాడు స్పెంగ్లర్, [4] మళ్లావిజిల్- మళ్ళా కదులుతుంది, బాబోయ్.— అంతలావే- ఆడాళ్లు అంత లావుగా ఎల్లావుంటారండి- మళ్ళా ఎప్పడి కప్పుడు, కండ, మాంసం, రక్తం, పిల్లలకి పంచిపెట్టే పింతర్వాత, యింకా అంత మిగిలితే, పిల్లలే లేకపోతే యింకా ఎంత లావుగా వుందురో- ఫెదర్ వైట్ ఛాంపియానెస్- [5] నాకొక అపూర్వమైన వైజ్ఞానికానుభవం లభ్యం కాలేదు- నాకంటె తెలివైన వారికి, చరిత్రకథలో వొకలయ, క్రమం, పద్ధతి, ఆకృతి, కనుపించాయి. శాశించ బడిన యీ నాదం, నాకు వినబడలేదు. కెరటాన్ని మరో కెరటం తరుము కొచ్చినట్లుగా, వొక అవాంతరం మరో అవాంతరాన్ని తరిమింది.- ప్రతి సంఘటన, ప్రతి ఫలితం వొక ప్రమాదం-

1 నగుమోము గనలేని - త్యాగరాజు కృతిలో చరణం.

2 ఆర్థిక శాస్త్రంలో - కొనుగోలు శక్తిక్రమంగా తగ్గడం.

3 మునిరి సుబ్రహ్మణ్యఅయ్యర్ - సంగీతవిద్వాంసుడు.

4 చరిత్రకారుడు స్పెంగ్లర్ సిద్ధాంతం

5 స్త్రీఫహల్‌మాన్.

ప్రమాదాలనుండి జనించిన పరిణామం మానవ చరిత్ర." [1] ఫిషర్ గారి వుపోద్ఘాతం. "కొట్టుకు పొయ్యే పడవ ఆదిపురుషుడు టావో. ఇటు పోతుంది- అటు పోతుంది." టావోటికింగ్. [2]

ముప్ఫైనాలుగో అధ్యాయం, ఆడదొస్తే నేనెందుకు లేవాలి? సమాన హక్కులు, ఆస్తిలో వాటా. ఇప్పుడు ఆస్తులకోసం అన్నద మ్ముల కొట్లాటలు. మరిరేపో? అక్కయ్య ఆధ్వర్యం. మెయిడ్ ఆఫ్ మేట్రియార్కీ- [3] ఇన్నాళ్లుఆమె పెదవుల చిరునగవు కోసం వేచిన వేమన్న, యీనాడు ఆమెమెళ్లో పూసల సేరులోంచి చర్మం వేడికి వూడిపడితే, ఏరుకు అమ్ముకుంతింటాడు -ఇదే ఏరువాకా సాగాలోయ్ అంటే. నాకేం చూడనట్లు నటిస్తాను. అందరూ అంతే. భారతదేశంలో స్త్రీకి అంతగౌరవం వుంది.

గార్గి, భార్గవి, తైత్తిరేయ ఉపనిషత్తు బండరినాయికా- [4] వోర్ వెర్రివాడా- బ్రహదారణ్యకరా- నోరు తిరగదు? సంస్కృత పాఠాలతో పళ్లూడగొట్టుకో— ఈశోపనిషత్తు- కఠోప భవిష్యత్తు, త్వం, ఓం,- తత్వ మసిచేసెయ్యి, బస్సుకదుల్తోందా- వొక్కడూ దిగడు. అంతా ఎక్కేవారే- దిగేవారు లేరు. ఆ ముసలాడు చావగానే, ఎగ డతారు డజనుమంది.-ఆ వల్కనైజ్‌డు టీసెట్ లోకి [5]— జగమేలే-

---

1 హెచ్. ఎ. ఎల్. ఫిషర్. ఆంగ్ల చరిత్రకారుడు స్పెంగ్లర్ సిద్ధాంతాన్ని ఖండిస్తూ వ్రాసినది.

2 చైనాదేశపు గేయంలో భాగం.

3 సంసారానికి మూలం స్త్రీగనక, సంఘసంక్షేమం స్త్రీల ఆధ్వర్యంపై ఆధారపడుతుంది-హిందూకోడ్ బిల్ ఫలితాల జోస్యం.

4 ఉపనిషత్తు పేరు వక్రింపు.

5 సీట్‌లోకి - టీసెట్ కింద ధ్వని కుదింపు (స్పూనరిజమ్).

శమ్మంగుడి - ఇంటర్ వ్యూ — లోపలిలీల దర్శనం — లిబిడో - [1] ఫ్రాయిడియన్ ట్రవుమా. "గిర్ షిన్. బలే పసందైన పిల్ల- ఆమె రిప్యన్ నేత్రం కింద, పెద్దదిగా కనబడటానికి గేట్లున్నాయి. జుబ్బా తొలిగిస్తే, స్నేహపూర్వక మైన ఆమె స్థనాలమధ్య న్యూమోనియా మహాదానందం వాగ్దానం వుంది" [2] ఎలియట్ గారి అమరత్వపు గుసగుసలు. (Whispers of Immortality)గిర్ షిన్ రష్యన్ కన్య పిల్ల కన్యకితల్లి [3] శంకర్స్ సిక్లీ [4] జరిపిన అంతర్జాతీయ బాలిక చిత్రకళ పోటిలో ప్రెసిడెంటుగారి రేడియం మెడలు అందుకుంది.

మరినాకో ? చాలా కాలం నిరుద్యోగిగా ఉన్నందుకూ, అనేక ఇంటర్ వ్యూలలో పాల్గొన్నందుకూ, హేవియం థోరియం [5] మెడలు మేడమ్ క్యూరియం [6] తో పంచుకుంటాను. లేకపోతే ఇంటర్ వ్యూట! "ఇంటీరియర్" అంటే లోపలి— వ్యూ అంటే దృశ్యం— నీలోపల ఏముందో వాడు ఎలా చూస్తాడు.? నా ఆత్మ ఎక్కడుంది? కాలర్, టై, కోటు; చొక్కా, బనియన్ నాగరికత నాకు తగిల్చిన శృంఖ

1 లిబిడో-మనస్సులో అధోలోకం, రహస్యమైన ఆలోచనల మందిరాలు.
ట్రివమా- మానసిక వ్యాధిమూలం.
బాల్యంలో హింసకు సరైన మనస్సు, ఎదిగింతర్వాత ప్రవర్తనలోని వైకల్యానికి కారణం అని ఫ్రాయిడ్ సిద్ధాంతం. సెక్సుజీవితంపై యీ హింస ప్రాబల్యం ఎక్కువగా కనపడుతుంది.

2 సాహిత్యానికి నోబెల్ బహుమానం పొందిన ప్రసిద్ధ ఆంగ్లకవి, విమర్శకుడు, టి. ఎస్. ఎలియట్ పద్యానికి అనువాదం.

3 పసివాడు ఎదిగిన మనిషికి తండ్రి - వర్డ్స్ వర్త్ కవి నిర్వచనం స్త్రీకి అన్వయింపచేశాడన్నమాట,

4 శంకర్స్ వీక్లీ అనడం బదులు, ఆది చదివినవాళ్ళు 'సిక్లీగా' (నీరసంగా) మారతారని ధ్వనికాబోలు.

5 లోహాలు, (అరుదు)

6 క్యూరీ - రేడియమ్ కనుగొన్నది,

లాలు వాటిని పిప్పితే, కత్తిరమార్కు గుండె. [1] బంగారు కణికి ఉడిపి కాఫీ లంగ్.- ఆచ్- హెచ్- హోచ్. [2] ఆమె చీరకి తగిల్చిన బ్రూచ్. ఇటాలియన్ వేదాంతి. బెనిడిట్టో క్రోచ్ [3] లారెల్ హార్డి హారల్ హోచ్ [4] షణ్ముగం ముక్కుపొడా. చంపావు. ఇంకాప్రో బేషన్ పూర్తికాలేదు. మార్చి, సెప్టెంబరు మార్చి. మైడియరు మధు. షూటింగు మొన్ననే మొదలెట్టాము. జింకార్ బెట్ [5]

ప్రారంభోత్సవము చేసాడు. కొమవాన్ కొండలు సప్తరంగులచిత్రం. [6] రైం ఎంతండి.? ఝుంగ్, ఝుంగ్ హామ్. [7] అలారము రైముఫీస్, అల్లుడికి బరంపురం ట్రాన్సఫరు. ఒక్కమాట తెలియదు. ఎవడి గొడవ వాడిదే. పంచవర్ష ప్రణాళిక-పంచశీల,- పంచరత్నాలు – పంచపాండవులు – పంచామృత్రం నీరుకాయ పంచి- నేనెవర్ని ?- ఎక్కడికెడు తున్నాను.? 'నీవు ఎవ్వరవో తెలుసుకో' అదే సర్వతత్వాల సారం - సారో [8]

తెలిసింది నేను ఫలాన - ఇంటర్వ్యూకి వెడుతున్నా - సెక్రటరియట్ లో దిగుతున్నా గోకింది ఆమె కాలు అయినా కాలు నాస్వం

1 సిజర్ సిగరెట్.

2 తుమ్ములు - లయకోసం అర్థంలేని ధ్వనులు.

3 క్రోచీ - ఇటాలియన్ తత్వజ్ఞుడు.

4 హాల్ రోచ్ కంపెనీలో లారెల్ హార్డిలు (హాస్యనటులు) పనిచేస్తున్నారు.

5 ఫిలిం షూటింగ్.

"షూటింగ్" అంటే వేటాడటం అనే అర్థం కూడా వుంది. జిమ్ కార్బెట్, ప్రసిద్ధ పులి వేటగాడు.

6 సూర్యరశ్మిలో ఏడురంగులు ఉంటాయి.

7 జంషూమ్ - కంపెనీవారి అలారమ్‌గడియారం.

8 సారో- విచారం 'సారం' గా మార్చబడింది.

ఏమే.- [1] నాపాతదే- ఊడిపోలేదు. పక్కన సుందంది పాపం సీటు లేక ఈపిల్ల కూర్చోమంటే పాపం!

ఆమె తాలూకు ఎవడయినా వుంటే చావతంతాడు ప్రశ్నం చేసింది, వాడ్ని తోసికూర్చుంది.

లక్ష్మీబాయి [2] అప్‌దిబస్.

కోటికూర [3] సబ్బువాసన ప్రక్కల నిలబడి. అళత్తూరు సోదరుడు. [4] అబ్బా ఆపవయ్యా- క్షమించండి.

గాడిదఅని అర్థం వచ్చే రెండు అక్షరాలమాట కావాలి. క్రాసు వర్డు ఫజిల్ కడుతున్నాను.

నేనేఅపుతే ఆమాట చివరిదే [5] క్రాసువర్డు సంభాషణ.హాల్లో మంచిచెడ్డలలో మంచిది సాయంత్రానికి వ్యతిరేకం. గుడ్ మార్నింగ్, స్పైన్సుకిసుక్కున్నవోక ఆఘునికపింత, పెడతాకి వ్యతిరేకం,'సినిమాకి వస్తారా?' అలాగే క్రాసువర్డు ప్రేమ. ఓనా, నాలుగుపెదవులుకలిస్తే- సింహాసనము మీద కూర్చున్నఒక స్త్రీ, 'అహం'నీ.-అనురాగానికి మరో పేరులెండి-ంచు[6] చున్నావా.ఇవి మర్చిపోవాలి. రెండు చేతులూబిగించి కూర్చోవాలి. గుప్పిడివిప్పితే ఏమీలేదు. హరిశ్చంద్రుడు అన్నట్లుఅంతే జీవితం. తమిళసోదరుడు కదిలాడు నేనేమిచేసేదిరా నారామ.

---

1 ఎవరికాలో గోలేదు.

2 ఝాన్సీ లక్ష్మీబాయ్.

3 కూటి కూర సబ్బు.

4 అలత్తూర్ సోదరుల పాటకచ్చేరి రేడియోలో వినబడుతోంది. ప్రక్కల నిలబడి - కృతి.

5 గాడిద అని అర్థంవొచ్చే రెండక్షరాలమాట 'నేనే'.

6 "అహం" ని ప్రేమించు- లో 'ప్రేమ' అనేమాట "అనురాగం"గా పైవాక్యంలో వుండిపోవడంవల్ల 'ంచు' మాత్రం మిగిలింది. నన్ను ప్రేమించుచున్నావా? అని తాత్పర్యం.

ఇదిగో నా పర్సు 'ఏమండోయి సత్యనారాయణ గారు ఎప్పుడు రావటం' 'ఏం ఇలావచ్చారు,?' ఆయన కనుబొమ్మలు చిట్లిస్తున్నాడు 'తమరెవరు ?' 'అప్పుడే మర్చిపోయారు.?' 'నేను ఏకలవ్యుణ్ణి, లోహిదాసుణ్ణి. మీదగ్గర చదువుకున్నాను.' 'ఓరి శుక్రాచారి నీవటోయి! సినిమాలో మనకోచిన్న వేషం ఉందిలే, పక్కరోలు-' 'ఆఖరికి మీరు ఇందులో 'దిగారు ?' 'అంటే నీఅభిప్రాయం ?' చెండాలపు వాసన 'బొంబాయి అందమైన పట్నాలలో ఒకటి-

విశాలమైన రోడ్లు,అందమైన భవనాలు, ఒక్కొక్క భవనంలో ఒక చిన్న పట్నంలో వున్నంత ప్రజ. మధ్య చీరల తెరలు కట్టుకొని. తెర వెనకాల ఆ కుటుంబాల భాగవతాలు [1]. అందమైన పార్కులు. జూహూబీచ్ బ్రైటన్ని మరిపిస్తుంది అంటాడు హక్స్లే, [2] హక్స్లేకి ఏమితెలుసు ? మిస్ పరిమళ చంద్రసర్కారుతో డయిమ్లర్ [3] లో బీచ్ వొస్తు షికారు వెళ్ళిఎన్ని అయినా వ్రాయవొచ్చు.

ఈ కండక్టరు ఉద్యోగం చెయ్యమంటే బాగుండును.

టక్ ! ఆగింది బస్సు - అబ్బ కాలుతొక్కావయ్యా ! ఆజడ ఆ కాళ్ళు ఎవ్వరివో ! చేతులు, బుజాలు, వెన్నులు, తలలు, టోపీలు ఈవెనింగ్ ఇన్ ప్యారిస్, [4] కోటి, ఫాంపియా, చచ్చిన చేపవాసనలు. నలిగాను.

ములిగాను. చచ్చాను

---

1 బొంబాయి పట్నంలో ఇల్లు యిబ్బంది. ఒక్క గదిలో రెండుమూడు కాపురాలవారి అవస్థలు.

2 ఆల్డస్ హక్స్లే - రచయిత. "జెస్టింగ్ పైలేట్" అనే యాత్రా గ్రంథంలోనిది.

3 డైమ్లర్ - మోటారుకారు పేరు.

4 పరిమళాల పేర్లు.

అమ్మ బయట పడ్డాను. టిక్కెటు టిక్కెటు నేను శవాన్ని, పర లోకాని కే టికెట్టు.

"జేబులో చేయిపెట్టి లోగు కష్ట ఒదిలితే కులుతాను. చిక్కి పోయిన సెకండ్ హాండ్ సిగిరెట్టు కళేబరం.

"ఏయ్ జేబులో చెయ్యితీ." ఎక్స్‌క్యూజ్ మి! నా జేబు అనుకున్నా. "వుండవయ్యా ఇస్తాను చిల్లర." పదమూడు నయేపైసలు. సెక్రటరి యట్ లో అపు. ఆ కుర్రాడు నీళ్ళుచేస్తున్నాడు. ఓరి సింధ్రి ఫ్యాక్టరీ!

అ హా హో, నవ్వులు ఈలలు బయటికి ఊడిపడని భావపరం పరలు.మృత రోదనలు—

'నీవు పరీక్ష ప్యాసై రెండేళ్లయింది ఈ రెండేళ్ళు ఏంచేస్తు న్నావు? ''ఎప్పుడు పొట్టకోసరం ఏదో చేస్తూ వుండడం జంతువుల లక్షణం— పొట్టనిండిన తర్వాత ఏమి చేయకుండా వుంటేనే మానవుడి ఔన్నత్యం బయటపడుతుంది" జె. బి. యస్ హాల్డేన్. వర్జీనియా పుల్ఫ విషం త్రాగి చచ్చింది [1] 'సంఘాన్ని వుద్ధరిస్తున్నా సార్' 'ఏవిధంగా?,' నేనువూరికే కూర్చుండుటవల్ల నేను చేయగల పని మరొకడు చేసి బాగుపడుతున్నాడు, అది నాత్యాగం,' ఇల్లాంటి వంకు దొరకి కోపం రావచ్చు ''ప్రేమిస్తున్నా సార్," అమ్మో ! తక్షణం గెటవుట్ అంటాడు- కాని అదినిజం- నిజంచెపితే ఎవడికీ నచ్చనూ నచ్చదు. నమ్మనూ నమ్మడు—

'ఓస్త్రీకోసం మహా తంటాలు పడుతున్న సార్-" యవ్వనం అనుభవించవలసిన సమయంలో యువకుణ్ణి విద్యపేరుచెప్పి నాలుగు గోడలమధ్యా బంధించి వాడి సంతోషానికి సంబంధం లేని పుస్త కానికి కట్టేసి— వాడుతీరా కృతార్థుడైన తర్వాత వాడికి నిరుద్యోగని నామకరణం చేసి హింసించడం — విషాదకరమైన విషయం- నాకు ఉద్యోగం లేకుండా చెయ్యడం సంఘం లోపం.

---

1 వర్జీనియా వూల్ ఫ్. - నవలా రచయిత్రి. ఆత్మహత్య చేసుకుంది.

ఆసంఘ నిర్మాతలలో మీరొకరు,

నాకు ఉద్యోగం లేదు, దైవభక్తి లేదు, మతం లేదు- యస్. వి. వి [1] అన్నట్లు దగుల్బాజీతో జంటెంకిగాడూ పంపుకొన్నాను. నీతి నియమాలు లేవు. ప్రేమలేదు పెళ్ళిలేదు, నాస్థితికి కారణం మీరు, మిమ్మల్ని యీ చేత కాని ఉద్యోగానికి రాజీనామా యిమ్మంటా," భలేలాజిక్, బ్రాడ్లేహాడిలి చస్తాడు [2] ఇందులో వొక్క విషయం వాడిముందు మాట్లాడగలనా ?

అమ్మ, బస్సు ఖాళీ అయింది. కాని సిగరెట్టు త్రాగడానికి వీలు లేదు. సిగరెట్టు వీలులేదు. [3] వెర్మూత్ పీల్లేదు. డ్రైమార్టినీ పీల్లేదు. తెల్లగుఱ్ఱం స్కాచ్‌విస్కీ అసలే పీల్లేదు. రెండో పెళ్లాం పనికిరాదు. అన్నీ నిషేధాలు. వాక్ స్వాతంత్ర్యము కోసము మిల్టన్ ఎరియోపెజిటికా వ్రాశాడు [4] రెండో పెళ్లాం కోసం డైవోర్సు గురించి వ్రాశాడు. వస్తోంది, వస్తోంది ఢాకినీ వారి 'అమ్మలప్పలు' షాలీమార్ బీడీకాలుస్తూ కండక్టర్ దిగాడు. మా అవలోకితేశ్వరుడు ఉత్తమ కళా సౌందర్య రాశి.

మా అజంతా ఔన్నత్యం అఖరి మాట. షాలీమార్ బీడీ క్యాలెండర్ బొమ్మై అవతరించాడు.

ఒహో కొత్తపిట్ట చక్కావస్తోంది- యీ ఆలోచనలు మహా పాపం- కాని పాపి కానివాడెవరు ? "నకర్ద-గుణేదర్శః కీస్థ్‌జెగో

1 తమిళహాస్య రచయిత యస్. వి. వి. ఒక ఆంగ్ల వ్యాసంలో అట్లా వ్రాశాడు.

2 ఎఫ్. హెచ్. బ్రాడ్లే- తత్వజ్ఞుడు. ఇంగ్లీషు శాస్త్రి సంశయతుడు.

3 పానీయం (వైన్) పేర్లు.

4 భార్యనుంచి ఎడబాటు సమర్థిస్తూ విడాకుల ఆవశ్యకతని గూర్చి గ్రంథం వ్రాశాడు మిల్టన్ కవి. పార్లమెంటువారు ప్రచురించే అనుమతి యివ్వలేదు. వాక్‌స్వాతంత్ర్యం ఆవశ్యకతను గూర్చి, 'ఎరియోపేజెటికా' అనే గ్రంథంలో వ్రాశాడు.

అంకుస్ కే గుణా నకుర్దుచంద్ జీస్త్ బెగో[1] ఎక్కడ కెడుతోందో 'మీ పేరు' 'మీవయస్సు' 1857 మే 10, శక జేష్ఠ చిత్రహి శాఖ[2] ఝాపది చపాతీలు తీసుకెళ్ళు[3] కర్మాన్‌సింగ్ - తాంతియా తోపేకి[4] తెల్ల చెపాతీలిస్తాం. ఆమెలో 'వివియన్‌లే' తాలూకు యవ్వనంప్లస్ మెరిలిన్ మన్రో[5] మ్యాజిక్ అది గుల్లాంరాంపావ్‌లో జార్జెట్. పల్చగా నల్లగా శరీరంలో గీతలు గంతలు, వంకరలు మెలికలు, యిప్‌స్టీన్ నగ్న సత్యం[6] లా, హెన్రీమూర్[7] వృద్ధ కన్యలా అన్నీ కనిపిస్తున్నాయి.

---

1 ఉమర్ ఖయ్యామ్ రుబాయత్.

2 కొత్త పంచాంగం తీసికెళ్ళు.

3 సిపాయిల తిరుగుబాటు, 1857 మే 10 న ప్రారంభమైంది. ఆరోజుల్లోనే, సైనికులు, యితరులు కూడా చపాతీలు పంచిపెట్టేవారట- నాలుగేసి చపాతీలు వొకరి చేతులో పెట్టి, ఫలానా వారికిమ్మని పంపే వారట - తిరుగుబాటుకి సిద్ధంకమ్మని సంజ్ఞచెయ్యడం అని కొందరి భావం. పది చపాతీలైన, పరవా లేదనని. చపాతీల లోపల ఏదో చీటీ వుంటుందని, మరికొందరు. తిరుగుబాటుకి, చపాతీలకి సంబంధం లేదనీ, అల్లా పంచిపెట్టడం అప్పటప్పుడు జరుగుతూ వుండేదని ఆర్. సి. మజుమ్‌దారు వ్రాస్తాడు.

4 తాంతియాతోపే - 1857 స్వాతంత్ర్య సమరంలో ప్రముఖ పాత్ర వహించిన వారిలో వొకడు.

5 ఫిలింతార.

6 ఇప్‌స్టీన్ - శిల్పి. 'రాత్రి' అనేది ప్రసిద్ధశిల్పం.

7 హెన్రీమూర్-శిల్పి. ఈయన స్త్రీ శిల్పాలలో అన్నీ కంతలే.

[1] (జే సూ్యాయిస్ రోమ్ లీరాయ్ డూన్ వేస్, ఫ్లావియో రిఛే, మైస్, యింప్యూయిసాన్, జ్యూనే, యెట్ పూర్టాంట్ ట్రావియో క్వి డి. సేస్ ప్రిశెక్టువార్సు మిప్రిసాన్ట్ లే కూర్ బెగ్సు. సేమ్యూవిలవెక్ సేచీయన్సు పామ్ యెవక్టు డాట్రేటీక్స్)

-ఫ్రెంచి భాషలో నేనాలోచిస్తే మరేంపాపంలేదు. వాడి మీద పగ తీర్చుకోవాలంటే వొకటే మార్గం. వాడిముందు విషం తాగిచావడం

వాడే చంపాడని వాడినరెస్టు చేస్తారు. పోలీస్ కేసు. మార్జెరీ అలింగ్[2] హామ్ మొగుడు భూమిత్రవ్వి ప్రాచీన నాగరికతనిబయట పెడుతూంటే యీామె ఖూని చేసి పాతేస్తూ వుంటుంది. ఎవడు చంపాడో చివరికి కాని తెలియదు. ఇనపకడ్డీలు- జైలు–బీదవాడిని ఆకలి దాహం బంధిస్తాయి. ధనికుణ్ణి వివిధ స్త్రీల హస్తాలు. అన్నీ కడ్డీలు. ఆ నాజూకు,ఆ అమాయికత్వం, యెక్కడా చూడలేం. గాలి పటంలా కొట్టుకుపోయి మేఘాలు డీకొన్న వెలుగులో మాయమై విప్పారుకున్న చంచలమైన చూపులు మరుని బారునుండి దూకులు. భవభూతి గుండెలు కొట్టుకుంటాడు. దంతపు సీసాలాంటి కంఠం-రవికె కోణంగా మడతపడ్డచోట తళతళ - పదునైన మొనమెరుపు.

---

1 ఛార్లెస్ బాడిలేర్ - ఫ్రాన్స్ దేశపు కవి 'కసి' అనే కావ్యంలో వొక భాగం. అర్థం = వర్షసామ్రాజ్యానికి చక్రవర్తిలాంటి వాడిని నేను-ధనవంతుండి కాని సత్తువలేదు; యువకుణ్ణి కాని వార్ధక్యం సంక్రమించింది. పాఠాలు చెప్పే గురువుల్ని, కాదని, కుక్కపిల్లలతో ఆడుకుంటాను.

2 మార్జెరి అలింగామ్.- అపరాధ పరిశోధక నవలా రచయిత్రి. భూమి త్రవ్వి ప్రాచీన నాగరికతని బయట పెడుతూన్నది ఆమె భర్తకాదు-అగాతాక్రిస్టీ భర్త.

లారెన్సు [1] జుట్టు పీక్కుంటాడు. మానవుడిబుద్ధికి లొంగని ఆ పికాసో [2] పెదవులు రష్యాలో విప్లవంతో వణికిపోతాయ్.

క్లైవ్ బెల్ [3] కేదార రాగంలో యేడవాలి. పెండ్లాం వకటి తగులడింది గాని లేకపోతే ఆ వ్యక్తిని హెమింగ్ వే [4] సముద్రంలో ముసలాడిలా [5] 38 పారలెల్ దాటి హిమలయాపర్వత ప్రాంతాలకి లేవతీసుకుపోదును.

పెండ్లామున్న వాడికి పరస్త్రీ అంటె ఎందుకంత భయం,సిగ్గు, చేతకానితనం మర్యాద ? ప స్త్రీని చూసినా మొదట వచ్చే ఆలోచన ఇది—ఈమె ఏదౌర్భాగ్యుడి హస్తాలలో నలిగి హతమౌతుందా- అని వాళ్ల పెదాలకు పట్టిన తుప్పును రాసి, ఉక్కు కడ్డీల క్రిందమార్చి ఎండి పోయిన ఎముక ముక్క క్రింద చేస్తారు. ఆ గుండ్రని ఎముకలను ఆర్జించటము ఈ ఎముక ముక్కల్నిఏరుకుని చప్పరించడానికి ఇవే ఆలోచనలు. ఫ్రాయిడ్ ఎట్లా కనుక్కున్నాడో? అన్యకాంతలు తల్లులు, అనిముఖారి రాగంలో నాలుగున్నరలో ఏడ్చిన నటుడు [6] దొంగ. వన్నుమోరు కొట్టిన ప్రేతకులు ధగ్గులు [7]

ఈమెని ఇంటర్వ్యూకి పంపిస్తే- ఆంతరంగికాన్ని కళ్లతో దర్శిస్తాడు. ఉద్యోగానికి- సూయజ్ మస్యపై రాజీనామా ఇచ్చి ఈమెకి చాకిరి—

---

1 లారెన్సు.- ఆంగ్ల నవలా రచయిత. ఆంతరంగికమైన 'సెక్స్' అను భూతులను అతిశక్తి వంతమైన శైలిలో చర్చిస్తాడు.

2 పికాసో-ఆధునిక చిత్రకారుడు. లావణ్యాన్ని వికృతంగా చిత్రిస్తే గాని, చూసేవారిని ఆకర్షించ దంటాడు.

3 క్లైవ్ బెల్-'నాగరికత' అనే గ్రంధం వ్రాశాడు.

4 హెమింగ్వే- అమెరికా దేశపు నవలా రచయిత- 'ది వోల్డ్ మాన్ ఎండ్ ది సి.- (వృద్ధుడు-సముద్రం)- అనే నవల వ్రాశాడు.

5 కొరియా విభజనని సూచించే గుర్తు.

6 నక్కుబాయి నాటకంలో పద్యం.

7 పందొమ్మిదవ శతాబ్దంలో దారుణాలు చేసిన దుండగీడులు.

నైలు రాణీ, క్లియో పాత్రా ముక్కు మరింత పొడుగుఅయి వుంటే ప్రపంచ చరిత్ర మరోలా వుండేది.[1]

ఆ మెడికా మాన్యువల్ తీసింది. సంచీలో నుంచి పాయిజన్ గొట్టాలు తీసింది. థర్మామీటరు గుండెల కానించి వినేధ్వని స్టెతోస్కోపు.[2] ఆ, తెలిసింది. మెడికల్ కాలేజీలో చదువుకుంటున్న కన్య రెండువేలు అడ్వాన్సు ఇచ్చి సీటు, కాని జాలి వేస్తుంది. ఏం బ్రతుకు.

అసుకుమార్[3] నందలాల్ బోసు హస్తాలతో జెమినీ రాయ్ కళ్ళ అద్దాలతో[4] ఆ కప్పుల్ని ఆ మాంసముద్దని ఛ. ఛ — చాగాల్[5] డోకు వస్తుంది.

అదంతా చూసి తనజన్మలో పిల్లల్ని కనదు. కాని త్రయం గాళ్ళు —[6] డార్విన్, లామార్క్ బఫాన్ గాళ్ళు — స్వంతం కాదు పోదీ—

పరిణామ వాదంవూరుకుంటుందా ? ఎక్కడున్నా ఏపని చేసినా ఏవికారం చూపినా, అన్నీ మాతృత్వం కోసమే[7–8] సంతాలులు—

---

1 క్లియోపాత్రా రాణిని గురించి 'పాస్కల్' అన్నది.

2 స్టెతోస్కోప్.

3 వంగ చిత్రకారుడు.

4 జైమినీరాయ్ చిత్రాలలో స్త్రీలకళ్ళు పెద్దవి.

5 చిత్రకారుడు చాగాల్.

6 డార్విన్, లామార్క్, బఫన్-జీవశాస్త్రజ్ఞులు,- పరిణామవాదాన్ని నిర్వచించారు. 'బఫన్' ని బెర్నార్డుషా 'బఫూన్' అన్నాడు ఛలోక్తిగా.

7 హెన్రిబర్గుసన్ ఫ్రెంచితత్వశాస్త్రజ్ఞుడు అన్నది.

8 మధ్యలో సంతాల్ స్త్రీలు జ్ఞప్తికొచ్చారు. స్వాంతంకాదు కిలయకోసం కాబోలు

నాయనా- అదుగో సెక్రటరియట్. దివాని ఖాను. దవాఖాన. కప్పుమీద బురుజుగడియారం గజనుపుష్పు. ఈ భూప్రపంచంలో ఏవరైనాదాన్ని చూసి టైము ఎంతైందో చెప్తే రాకెట్లో చంద్రగోళానికి ఫ్రీరైడ్. మిస్ డీకల్[1] రిస్టువాచీ చూసుకుంటుంది. నల్లటి నైలాను స్ట్రాప్. గోల్డువాచి. సామ్యుయెల్ గోల్డువిన్ చిత్రకథలు[2] భూకంపంతో ప్రారంభమై పరాకాష్ట నందుకునే చిత్రం కావాలి.

మ్యాటర్ లింకు, రాసిన ఒక నాటకాన్ని సినిమాకోసం మూడు నెల్లు కష్టపడి అనుసరించి వ్రాసి తెప్పించాడు. ఒక గంటలో అదంతా చదివి "ఓనా దేవుడా ఇందులో కథానాయకుడు. కందిరీగ"[3] మెళ్లో, నల్లటి తాడుగొలుసు. నల్లటి బొచ్చుబొళ్ళు 'ఫాలిష్ వేస్తానుమిస్. స్టడీఇన్ బ్లాక్ రాయచౌధరిని[4] రప్పించి ఈమెను మోడల్ గా నించోపెట్టి చీకటిఅనే చిత్రం చెక్కమంటే బాగుండును.

---

1 మెడికో, మెడికల్ - కలిసి డీకల్ గా క్లుప్తీకరణ.

2 సామ్యుయెల్ గోల్డ్విన్ - ఫిలిం దర్శకుడు. - అతని వింత భావాలూ భాషని గురించి ఎన్నో కథలు ప్రచారంలోకొచ్చాయి. వీటిని 'గోల్డ్విసమ్స్' అంటున్నారు.

చిత్రం భూకంపంతో ప్రారంభమైతే. - క్లైమాక్స్ తరవాత రావడం అసంభవం.

3 ఇదొక కథ. మాటర్ లింక్ - నోబెల్ బహుమానం పొందిన బెల్జియన్ దేశపు రచయిత. కీటకాలను గురించి వ్యాసాలు వ్రాశాడు. వాటిల్లో ఒకటి కందిరీగని గురించి.

4 వంగ చిత్రకారుడు, శిల్పి.

ఏమిటో ఈ దుస్వప్నాసులు. "పరాదుఃస్వప్న్యం సువ" అన్నాడు గా వేదుషి [1] అరెరరె, రే 'అర్రే భాయి' డ్రాం - డ్రీం - ట్రూం - ఠంగ్ - ఠింగ్ - క్లాంగ్ - గ్రిర్ - డచ్ — చచ్చాడు.

హాండిల్ బారు ముక్కలైంది
మడ్‌గార్డు చక్రంలో ఇరుక్కుంది.
లాగండి. ఆస్పత్రిలోకి లాగండి. నెత్తురు.
ననసన త్రిస్తురు- పళ్ళూడాయి.

స్త్రీలకి మొగాళ్ళకంటే తక్కువ పళ్లు వుంటాయన్నాడు, అమాయకుడు అరిస్టాటిల్ [2] మళ్ళీ రెండుసార్లు పెళ్ళి చేసుకొన్నాడు, పెళ్ళాంనోరు తెరవమని, లెఖ్ఖ పెడితే తేలిపోనుగా. ఈ విధంగా మూఢాచారాలు గ్రుడ్డి నమ్మకాలు బయలుదేరాయి. [3]

తప్పు, సైకిలువాడిదేనంటే — కుడివైపుని వెడితే యేమవుతుంది, ఆ! బస్సువాడు హారను వెయ్యొద్దంటే? వేశాడు. అన్ని బస్సులుఒకే ధ్వనిగా.

ఎదురుగుండా వస్తున్నబస్సు దనుకుని దీనిక్రింద పడ్డాడు, పాపం యెవడో? నీపేరు.? "వేలాయుధం" అంటే కత్తి అన్నమాట. 'నేను శాంతి నెలకొల్పటానికి భూలోకానికి వచ్చాననుకోకండి. శాంతి నివ్వటంకోసం రాలేదు. కత్తిని యివ్వడం కోసం వచ్చా.

---

1 వేదాలలో ఋషి. - వేదుషి.

2 అరిస్టాటిల్ - గ్రీసు తత్వశాస్త్రజ్ఞుడు.

3 బెర్‌ట్రాండ్ రసెల్ - 'సంఘంపై విజ్ఞానశాస్త్రం యొక్క ప్రభావం' అనే గ్రంథంలోనిది.

ను.[1] పింగ్ సైకిల్ ధరెంతండీ? ఏయ్ కండెక్టర్ నీపేరు ? నెంబరు చూసుకో. గెట్ యిన్ గెటిన్. క్లింగ్ క్లింగ్.

చిన్నగాయం.

హిందుస్థాన్ బ్యాంకులా చెక్కు[2] చెదరలేదు. సైకిలుమాత్రం ఆటమ్‌లక్రింద విడిపోయింది. బస్సు పోనివ్వండి ఘర్ బరాబర్.

హోల్డాన్!

మొనాకో[3] బిస్కట్లు. గ్రేస్ కెల్లీ వెడ్డింగ్ కేక్.

మిస్ మెడికో దిగుతోంది.

మిస్ వైఫరీ గ్రంథాన్ని బ్యాగ్ లో ముడిచి హంసలా నడిచి మురద గుంటలోకి ఆస్పత్రిలోకి వెడుతోంది.

వేలాయుధం, వేళాయుధం! నాగరికత కోసం తన సైకిల్ ను త్యాగం చేసాడు. నాగరికతంటే సౌందర్యం కోసం సాంకర్యాన్ని త్యాగంచెయ్యడం.[4] ఏమిటి సౌందర్యం ? సౌందర్యం తన అందమైన నేత్రాలను వుంచుకోలేదు.[5] తారు, క్లోరోఫారం, ఫినైల్, డిడిటి, సిగరెట్ పొగ, చెమటతో కలిసిన, మాక్సుఫాక్టరీ లిప్‌స్టిక్, పెట్రోల్, ఫాక్టరీనుసి, డ్రైనేజ్ రివేర్ యివి మా సువాసనలు.

హోటల్ ప్రక్క పులీస్తరాకుల కోసం నలుగురు యువకులు నాలుగు కుక్కలు కొట్లాడుకొని సేట్ జీ కారుక్రింద పడటం.

---

1 ముత్తయ్య సువార్త - పదవ అధ్యాయంలోనిది.

2 'చెక్కు' = దెబ్బ.

3 మొనాకో బిస్కట్ల కంపెనీ - మొనాకో దేశపు రాజు, గ్రేస్ కెల్లీ, (కిల్లీకాదు) ఫిలింతారని వివాహమాడాడు.

4 కళా విమర్శకుడు - హెర్బర్ట్ రీడ్ అన్నది.

5 కీట్స్ కవి గేయం లోనిది.

ఆపరేషన్ బల్లపై యింజక్షన్ సూదులు.

అమెర్కా యింకెప్పుడూ చెయ్యను.

ఎండిన నాలుక.

కాలే నుదురు. పగిలిన పెదవి. జారిన బాడీ.

పొట్ట పెంచడం కోసం జుట్టు పోగొట్టుకొన్న బోడి బుల్లిలు.

ప్రపంచంలో డాక్టర్లంతా సమావేశమై, ఊడిన జుట్టు రాదని తీర్మానించారు. ఇవి మా కళా పూరితమైన దృశ్యాలు. మిస్ మెడికో[1] మొహింజొదారోలో వంటిస్తంభం ముత్యాల మేడమీద మృదంగం మోతకి నాట్యం చేసింది.

హరప్పా పాలతొట్టిలో స్నానం చేసింది. ఎల్లోరాలో రాళ్లకి పోతపోసి పవిత్రతతో పొంగి పోయింది. కాళిదాసుకి కలలో కని పించింది. నేడు మందుల షాపులో విషాలమ్ముతోంది.

దంతం, మంచిగంధం, బంగారం, వజ్రవైఢూర్యం. వెన్నెల, గులాబి, అన్నింటికి మించింది మా మెడికో ధర్మామీటర్.

మా మేనక మేకప్‌మాన్ సిద్ధ హస్తాలతో చంపలు ప్రయోగించు కొంటోంది. మా రంభ రిబ్బన్ షాప్‌లోకి రమ్మంటోంది. మా ఊర్వశి మరి చెప్పను. చెప్పకూడదు. చట్టనిషేధం. నన్ను జైల్లో పెడతారు.

మా సీత రావణాసురుడు సీనయ్యతో లేచొచ్చి డైరక్టర్ సీతా రామయ్యని పెళ్లి చేసుకొంది. ముసిలాళ్ల ముళ్ల పొద. యువకుల తడిసినకల. కవులు వ్రాయని మహాకావ్యం. నమూనాలేని ప్రపంచ

---

1 మిస్ మెడికోను గతంలోకి తీసుకుపోయి, ఊహాగానం, హరప్పా, మొహెంజదారోలు - ప్రాచీన నాగరికతలు.

ప్రణాళిక. [1] వకలాల్చి వ్యక్తి సౌందర్యంఅని సిరాష్[?] పడుస్తున్నాడు. మా సౌందర్యాన్ని హాలీవుడ్ దొంగిలించి అరణాలికిఅమ్ముతోంది. మ్యాటినీకి సగం రేట్లు. అంతాభగ్నమైపోయింది, అతికిస్తాం 'అతికిస్తాం పగిలినముక్కలైనా మాకివ్వండి' అని సమాజసంస్కర్తలు. జిగురు బుడ్డికి పైసాలేదు. కుడతాం. కుడతాం. దారంలేదు. నారతేవయ్యా. నిజంగానీకు కావల్సింది నారి.

అఫీసుకెళ్లాలి. [2] బాస్ కూతురు బర్తుడే. చాక్ లెట్ల పొట్లం యివ్వాలి. వోనాల్గు రూపాయిలుచేబదులిద్దు. పెద్ద వాడ్నయ్యాను. మూలుగుబజ్బు, చీకటి కుళ్లు, ఈగలు, దోమలు, బల్లులు. వాడిపెళ్లాం నదురు 'దానిమొగుడు బుజాలు' యింజక్షన్, మృత్యువు, నిప్పు, మంత్రాలశాస్త్రి. ఇంతమహానుభావుడులేడు. బతికున్నన్నాళ్లు వాళ్ల మొహంచూసినవాళ్లు లేరు.

ఇదిపాత చింతకాయ పచ్చడి [3] స్టేల్ రేయేల్ [4] జీవితంఅంటే భయం. పతనాన్ని వుద్భవించే ఉద్రేకానికి అక్షణాన్ని లొంగి సజీవుడు కమ్మంటూవాసార్త్రే [5] ? విట్ వేమన్ [6] లాగా జీవితాన్నుండి పారిపోతాను. బాబోయ్, భయం మిస్ మెడికో నల్లచీరకొంగులో దాక్కొంటాను. ఏది కనపడదేం.

---

1 భావకవని కాబోలు.

2 సంస్థలో పై అధికారి.

3 చచ్చినవాడి కళ్ళు చారెడేసి అన్నది పాతచింతకాయ పచ్చడి -

4 పాతబడిన పానీయం - అన్నాకూడా యిదే.

5 జీన్ పాల్ సార్త్రే - సార్త్రేకాదు. ఫ్రాంస్ దేశపు నవలా రచయిత. 'క్షణికమైన ఉద్రేకాలకి లొంగి ఆక్షణాన సర్వేంద్రియాల నుండి జనించిన తృష్ణతో సజీవంగా బ్రతకాలన్న, ' ఎగ్జిస్టెన్షియలిస్ట్' వాదాన్ని ప్రచారం లోకి తెచ్చాడు.

6 విట్ వేమన్.

వాల్ట్ విట్ మన్ - వేమన - లాగే సంఘంలోంచి పారిపోయి ఏకాంత జీవితం సాగించాడు. రెండుపేర్లకుదింపు.

ఎక్కడుంది ? ఎటుపోయితివో నా రాధా [1] ఇంకెక్కడికి ? వెళ్ళడాక్టరు మొదలియారుగు చుట్టకి అగ్గిపుల్ల నుస్తిస్తాను - పుల్లా అగ్గిపిల్ల [2] గిరీశం కాల్చి పారవేసిన చుట్ట ముక్క. మైడియర్ హెలెన్ [3] ? యస్ డాక్టరు [4] రోమియో, ఫోర్డు న్యూ మోడల్ లో సాయంత్రం మినర్వాకి మైడియర్.

రామస్వామి ఎపెండిక్సు [5] ఎప్పుడుతీద్దాం. ఎల్లోరా కి ఎలోప్ అయింతర్వాత చలంగారి సాగుణ్యం [6] లో నాయుడు బావ మిస్ వటీరావు [7] కాళ్ళుపడుతున్నాడు. క్లిక్, క్లిక్, కెమారా ముందుకు నడుపు. ముందుకువచ్చెన్ను సార్. సారి. వీరేశలింగాన్ని రమ్మనవోయి.

నా లిఫ్స్టిక్ ఏది?

సత్యభామ దగ్గరుంది.

క్రిర్, కిర్ర్, ర్, ర్, గ్లిర్, గ్రిర్, ర్

---

1 గ్రామఫోన్ రికార్డ్, (రాధాకృష్ణ నాటకంలో)

2 'పిల్లా అగ్గిపుల్ల' అని వుండాలి.

3 గ్రీస్ పురాణగాథలలో సౌందర్య మూర్తి.

4 రోమియో - షేక్సుపియర్ నాటకంలో నాయకుడు.

5 శరీరంలో నిరుపయోగమైందని డాక్టర్లు భావించే వొక భాగం. ఎపెండిక్సును ఆపరేషన్ వల్ల తీసేస్తారు.

6 చలంగారి కథ కాదు, కుటుంబరావుగారిది.

7 దీక్షితులుగారి కథలలో నాయిక.

హోర్డాన్,

వ్యాంకుదగ్గర ఆపు.

సర్, సర్, జల, జల, గలగల జలగలా వర్షంపడి నదిగా ప్రవహిస్తోంది. వేదాళ్లో సదుల్ని బాగాపర్ణించారు. "అతిష్ఠస్తినాంలని వేశనానాం''

ముక్కు తెఱచిన గాలి లోపలికి వచ్చితీరును, తలుపు

తెఱచినవెలుగు లోపలికి ప్రవేశించుట తథ్యం.

''ఉతాకేలో భుజా, కహేప్రభు ఆజా '' 1

ఆసైకిలుపిల్లాడు,

హాస్పత్రిలో చచ్చాడేః

" ప్రమాదోమచ్చునో పదం '' అన్నాడు బుద్ధభగవానుడు.

తలతిరుగుతోంది. వాడిరక్తంచూసి నారక్తంఎగిరిపడుతోంది. నా అస్థిపంజరం కదులుతోంది 'నా' ఏమిటి? నేనెవర్ని? ఎక్కడి కెళతాను?

"మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః॥ నిర్వైరః సర్వ భూతేషుయః సమామేతి పాండవ॥" 2 మినోవన్ 3 నాగరికత లోకి జారిపోతుంది మెదడు. నేనుచైతన్య రాహిత్య విశ్వానికి చక్రవర్తిని.

---

1 మరాటీ భక్తిగీతం.

2 భగవద్గీతలో - గీతాసారంగా శంకరాచార్యులు వుదహరించినది.

3 ప్రాచీన నాగరికత.

నాగరికత మత్తుమందు మలినరక్తం మధుపానం ఎముకలు నా ఆస్తి కళేబరాలు. నాప్రియులు అధోలోకంలో అమరత్వం.

★ ★ ★

హోత్రాసు.

దిగండి, దిగండి. ఎరుంగో ఎరుంగో సార్, ఎవ్వరయ్యా నువ్వు? లే బస్సుఇక వెళ్ళదు. దిగుదిగు.

"నేనా?" హాహాహా నేను, నేనెలే"

ఉతో గెట్‌డప్పుర్ మిస్టరు.

పిచ్చోడ్రా. ఒకవేళ ఫిలింషూటింగ్ ఏమో., నాడి చూడండి. సోడాకాయ నెత్తిన కొట్టండి. పోతులా వున్నాడు వీడికేమి జబ్బు.?

ఏయ్ ఎక్కడికి వెళతావు.?

'నాకు తెలియదు.'

పిచ్చాడేరా, పిచ్చాస్పత్రికి లాగెయ్యండి. తలక్రిందకి కాళ్ళు పైకి పెట్టి వేలాడతీయండి.

"నేనెవర్ని? ఎక్కడి కెళ్ళుతున్నా ?"

"నీవు పిచ్చాడివి, ఆస్పత్రి కెళుతున్నావు పాపం."

"మీరు పిచ్చాళ్ళు. మీరు ఆస్పత్రిలోంచి బయటకు వస్తున్నారు. నేను వెళుతున్నాను"

హ, హ, హా, ఓ.హో,హో,

'వీడిది వేదాంతంపిచ్చిరా.'

నీఇల్లెక్కడ? మాట్లాడదే!

నాలుగు మొట్టికాయలువేయండి.

ఛ ఛా తప్పురా.

ఎక్కణ్ణుంచివస్తున్నావు.
నాగరికత నుంచి.
అహా, హా, ఓహో, హో
జేబులో టికెట్టులాగిచూడవోయి
ఆఁ తెలిసిందిరా
పెట్రోలు బంకు దగ్గర ఎక్కాడు. తిరిగి మీ బస్సులో అక్కడికి.
తీసుకు పొండి ఎరుగున్నవాడు ఎవ్వరైనా వుండొచ్చు.
ఓ. కె.
పరిదా అప్పిడిదా సేయలాం-
గెట్ ఇన్‌టిక్కెట్టు టిక్కెట్లు
క్లిన్ క్లిన్, బుర్ర్ర్ బుర్ర్ర్. స్టార్టు.
బ్యాంకు దగ్గర ఆపండి.
సుభాష్ రోడ్డుఎక్కడట.
నేతాజీ హోటలు ప్రక్కండి.
జాగాలేదు. ఫర్లాంగుకూ
సెక్రటరియట్ దగ్గర ఆపవయ్యా
వెళ్ళి గంటయింది
నెక్స్ట్ స్టాపులోదింపు.
అయ్యవారు అరుస్తాడు
వర్షం తగ్గిందిరా. చెత్తమాడేస్తోంది.
దుబుక్కు ఏయ్ డ్రైవరు కళ్ళులేవు?
సడన్‌గా బ్రేకు వేస్తావు?
డిడిక్కులు కొట్టుకుంటున్నావు? వచ్చేదే నంది పెట్రోలుబంకు.
మరిఈయనతో ఎవరైనా దిగుతారా?
అరెరరె చే సైకిల్.

డ్రూం. క్రీం. డ్రాం. డబ్. బెల్లూడింది

మడ్‌గార్డులో చిటికినవేలు పడిందయ్యా ర్యాష్ డ్రైవింగ్. వీడ్ని అరెస్టుచెయ్యాలి.

ముందు వాళ్ళమాట చూడండి. గాయం తగిలింది.

లేదులేదుపళ్ళు పూడాయి. ఆస్పత్రికి తోసెయ్యండి.

ర్యాలిధర ఎంతండి? గేరుకేసు, సీటు, చక్రాలు లేకుండా మూప్పై మూడు వేల నయాపైసాలు

ఏయి పోలీసు.

మీరెవరండి..

నాపేరు సులోచన. మెడికల్ కాలేజిలో చదువు కుంటున్నాను.

ఏయ్, నీపేరు.?

అల్లాఉద్దీను.

ఏయ్ కండక్టరు నీపేరు.?

44 నలభై నాలుగు

మూడోత్రివ్వు. బంకొటుబ్యాంకు.

రాసుకో భయమా

రాంగ్‌సైడులో వచ్చాడు. అంతా దిగండయ్యా ఈబస్సు ఇంక వెళ్ళదు.

మేము దిగం. ముందు ఆయన్ని దింపండి. ఈ యన్ని ఎవరైన ఎరుగుదురా.

ఏం ! సులోచనగారు నవ్వుతున్నారు.

అవును. ఏం.

ఈయన ఎవరో తెలియదు. మాట్లాడడు దిగడు: నాకాలేజికి పైయింది, ఏమయ్యా దిగుతావా. ఎవ్వరు నువ్వు

నేనా.

★ ★ ★

మిస్ మెడికో వెళ్ళింది.

అమ్మఇప్పుడు తెలిసింది.

ఆమె కనుబొమ్మలు చిట్లించి టైం చూసుకొని వెడుతోంది. పలకరిస్తా ఏం.

"క్షమించండి మీకేసిచూస్తూ ఆసైకిలు గుద్దు కున్న గొడవలో నేనెవర్నో మరిచి పోయాను. అప్పుడే మీరు బస్సులోంచి దిగిపోయారు కూడ. మళ్ళా మరో సైకిలు గుద్దుకొని ఆ గొడవలో మిమ్మల్ని చూడగానే తెలివొచ్చింది. సెక్రటరియట్ లో దిగి ఇంటర్వ్యూకి వెళ్ళాల్సింది. గుడ్ బై.

అహో, హోహో, ఓహ్హో, హో

బూటురిపేర్సు వాడు మళ్ళాసిద్ధం. వాడిదుకాణం రోడ్డు లెవల్ కంటే తక్కువలెవల్లో కట్టాలి లేకపోతే ఇంటర్వ్యూలు ఆగుంద్రని ఎముకలకోసం అరెరే. ఎంతపొరపాటు.

ఇంటర్వ్యూ రేపు. ఈ పూళ్ళో నేనెవర్నో మర్చిపోకుండా ఎప్పుడూజ్ఞప్తికి తెచ్చుకుంటూ వుండాలి.మనస్సుని అటుఇటుపరుగెత్త నివ్వకూడదు ఏంచేయను.? వేగం మన నాగరికతకు వెన్నెముక. సర్వగోళాలు వేగంగా కదిలిపోతున్నాయి, నది తనగర్భంలో గుంటలుండుట సహింపలేదు. గుంటలు నింపుటకు అది పరుగెడుతూ వస్తుంది. ఈసృష్టిఅనెడి నది, వేగముచే పరిశుద్ధ మగుచున్నది. నన్ను నేను మరచిపోయి, వేగంగా కదిలి జీవాత్మలో కలవనా అని జ్ఞాపకముంచుకొని ఇక్కడేవుండి కుళ్ళనా?

"నదీ వేగేన శుద్యతి"[1]

"ఓమ్ తత్సత్"

ఇంటి కప్పుమీద కోలర్ కోతి [2] నేనంత చిన్నప్పుడే ఎందుకు పెండ్లి చేసుకోవాలి.? ఈమెను కలుసుగుంటానని కలగన్నా

---

1 వినోబాభావే గీతా ప్రవచనములనుండి.

2 కోహ్లర్ - అనే జంతుశాస్త్రజ్ఞుడు. 'చింపాంజీ' (కోతుల) పరిశోధనలు చేశాడు.

నా? అసలు పెళ్లే చేసుకోకూడదు. టాల్‌స్టాయ్ [1] ఏంసుఖ [2] పడ్డాడు? శభాష్! రెడ్డి మామయ్య! ఘనకార్యం చెయ్యదల్చుకున్న వాడు పెండ్లి చేసుకోకూడదు. పిల్లల్ని కనడమే ఘనకార్యమైతే, పాసంతానం [3] పుడతారు. నేనువిమానం ఎక్కను. రేపునడిచి వెడతాను. గాంధీ ఫస్టుక్లాస్‌లో వెళ్లుంటే స్వరాజ్యం వొచ్చేదికాదు. దేవుడిచ్చిన కాళ్లు —తెలివికీ వేతనాలకీ సంబంధంలేదు. ఆకలితో మంచి వాడుగా వుండటం మెరుగు. [4] అదిగో ఇల్లు ........ అద్దికున్న స్వర్గం. అరవింద దర్శనం సమాప్తం.

---

1 రష్యన్ నవలా రచయిత - టాల్‌స్టాయ్‌ని వార్ధక్యంలో భార్య బాధలు పెట్టింది.

2 శభాష్ - సుభాస్ చంద్రబోసు. రెడ్డి - కట్టమంచి రామలింగారెడ్డి మామయ్య - సామర్ సెట్ మామ్ - (ఆంగ్ల నవలా రచయిత) ఈముగ్గురూ వివాహం చేసుకోలేదు.

3 పాకి సంతానం లేరు.

4 అరవిందుడు .

స్వర్గానికి - లయ - ఏదో తత్వం అలవర్చుకుని సమాధానపడాలని - అద్దికొంపకి, అరవిందునికీ సంబంధం కనబడదు.

# మరోమారు చదివేముందు....

క్షణికమైన వొక అనుభవాన్ని మొత్తం జీవితానుభవంతో ముడెట్టి యీరెంటి తారతమ్యాలు విభజన లేకుండా వున్నదివున్నట్లు ప్రదర్శించే యత్నమే చైతన్యస్రవంతి. గందరగోళంగా కనిపించే ప్రకృతిలోని కొన్ని విరుగులను యేరటం, అరాజకంగా కనపడే లోకం పోకడనుండి కొన్ని సూత్రాలు విడదీసి కళానుగుణమైన దృక్పథంతో వొక ఆకృతిలో కేంద్రీకరించి తీక్షణమైన శైలిలో ప్రదర్శించడం సంప్రదాయ బద్ధమైన సారస్వత కళ లక్ష్యం. విభజనలో వడబోతలో "సత్యం" దెబ్బతింటుంది గాన వున్నదున్నట్లు మొత్తం అనుభవాన్ని చిత్రించాలి అన్న ఆదర్శం యీధోరణికి మూలం. ఈలక్ష్యం ఎవ్వరికీ సాధ్యంగాదేమో: ఆదర్శంగానే వుండిపోతుందేమో! అయినా వర్జినియా వూల్ఫ్, గెర్ట్రూడ్ స్టైన్, రిఛర్డ్సన్ మొదలయినవారు చాలామంది యీపద్ధతిల్లో రచనలుచేశారు. కొంతవఱకు ఉత్తీర్ణులయిన వారిలో ముఖ్యుడు 'జేమ్సు జాయిస్' ఈపద్ధతిలో ఆయన రచించిన గ్రంథం 'యులిసిస్'. ఇందులో పదునెనిమిది గంటల వ్యవధిలో మధ్యతరగతి కుటుంబంలోని కొందరి వ్యక్తులు యేంచేసింది చిత్రితమైంది. రచనకి ఏడు సంవత్సరాలు పట్టింది. యెనిమిది వందల పేజీల గ్రంథమైంది. ప్రభుత్వం వారు ప్రచురణ నిషేధించడంతో నూతన ఉద్యమాన్ని లేవతీయాలన్న యువక రచయితల విప్లవాత్మకమైన కళాకలాపాలకి బావుటాగా ప్రచారంలోకి వచ్చింది.

•

ఈగ్రంథంలో దాపరికాలు లేవు. బాహ్య జగత్తులో వస్తువుల తాకిడికి జనించిన ఉద్రేకాలు ఊహలు, వాంఛలు- అన్నీ సమయం, స్థలం కలిసి నాలుగో పరిమాణంగా మారినట్లు- కలగాపులగం అవుతాయి, ఆ వ్యక్తుల కుటుంబ జీవితంలో అనుకోనే ఛలోక్తులు,

ఆమకొనే బూతులు, అశ్లీలం, నుడికారాలు, కుళ్ళు, చరిత్రపునాదులు సౌందర్యం, ఆధ్యాత్మిక చింతన, అన్నీ అస్పష్టమైన సంఘర్షణక్రింద గమ్యస్థానంలేని ప్రవాహంలాగా విచిత్రమైన భాషలో కదిలిపోతాయి. గ్రంథం అంతా అందరికీ అర్థంగాదు. దీనికొక టీకాతాత్పర్యం కూడా వ్రాయవలసివచ్చింది.

రెండురకాల రచనలుంటాయి. జీవితాన్ని విమర్శించి ముఖ్యమైన వాటిని ఎత్తి చూపడం, చాలా మందికి యిది నచ్చుతుంది. వీరికి శ్రమివ్వకుండా యంత్రం పనిచేస్తే చాలు. మరోరకం వారికి ఆయంత్రం యెలాపనిచేస్తోందో యేయే భాగాలున్నాయో అన్నీ వూడదీసి పరిశీలించాలని కుతూహల పడతారు. ఈరకంవారికి చైతన్య స్రవంతి నచ్చవచ్చు. పదునెనిమిది గంటల జీవితాన్ని వొక గ్రంథంలో యిమడ్చడంలో ఘనత యేమీలేదు. ప్రపంచంలో చిత్తుకాగితాలని చించి వాటన్నిటిని క్రమంలేకుండా ప్రచురిస్తేకూడా స్రవంతి పద్ధతి అనిపించు కుంటుంది.

కాని 'జాయిస్' ప్రతిభాశాలి; మహాపండితుడు. విజ్ఞాన శాస్త్రాలని, మతాల సారాన్ని. అవగాహన చేసుకొనిజీర్ణించుకొన్న సంస్కృతితో జీవితంగుండెపై చెయ్యిపెట్టాడు. ప్రచండమైన శైలి- అద్భుతమైన పాండిత్య ప్రకర్ష. చదువరిలో సంస్కృతి పెరిగినకొద్దీ,విజ్ఞానం విస్తరించిన కొద్దీ ఆరచనలో ప్రత్యేకత బయట పడుతూంటుంది. శైలికి వక ఉదాహరణ.

"మురికి చొక్కా తడిపి ఉతికి తాడుమీద ఆరబెట్టాడు - శిలపై యేసుక్రీస్తులా"

సృష్టి రహస్యాన్ని పరిపూర్ణంగా శోధించడం, ప్రదర్శించడం, యెవ్వరికీ సాధ్యంగాదు. "జాయిస్" రచనలో నాగరికతని వెక్కిరించడం- హేళన- ప్రధాన రసంగా కనపడుతుంది. జీవితంలో చెడుగుని కుళ్లని బయట పెట్టడం, నాగరికతనాశించటం, సుళువు. మరి దానికి బదులేమిటి? అంటేమాత్రం సమాధానం దొరకదు.

అందుచేత యీపద్ధతిలో గూడా సూక్ష్మమైన విమర్శ, అనుభూతులవిభజన, క్రమబద్ధమైన అరాజకత్వం, వుండాలేమో అనుకుంటాను. పేళనకి గుర్తైనవొక సంఘటన వస్తువు; సంస్కారంగలవ్యక్తి-అతనిరహస్యమైన ఆలోచనలు, వాంఛలు- స్థూల జగత్తులో పదార్థాల ప్రేరణకి యేవిధంగా చలిస్తాడో చూపేయత్నం యీ 'చైతన్య స్రవంతి'లో జరిగింది. ఇందులో కథవుంది. ఒక యువకుడు వుద్యోగానికి దరఖాస్తు పెట్టుకొన్నాడు. ఫలానాచోట- ఫలానా రోజు, యింటర్ వ్యూకి రమ్మన్నారు. అతను వొక బస్సులో బయలుదేరతాడు. కొంతదూరం వెళ్లాక వొక మెడికల్ కాలేజీ విద్యార్థిని ఆబస్సులో యెక్కుతుంది. ఆమెను చూడగానే యేవో ఆలోచనలతో ఊహాలో పడిపోతాడు. ఆమె దిగిపోతుంది. ఇంతలో వొకసైకిలు బస్సుకి గుద్దుకొని ప్రమాదం జరుగుతుంది. ఆప్రమాదం గతంలో విహరిస్తున్న మనస్సుకి వొక'షాక్'లా తగిలి అతని జ్ఞాపకశక్తి పోతుంది. చైతన్య రహితుడవుతాడు. బస్సుతిరిగి వొస్తుంటే మరో సైకిల్ గ్రుద్దుకొని, మరోప్రమాదం జరుగుతుంది. చుట్టూమూగిన జనంలో మెడికల్ కాలేజీ విద్యార్థిని కూడా వుంటుంది. ఈ రెండో ప్రమాదం'షాక్' వల్ల ఆమెను చూడగానే అతనికి మళ్లా జ్ఞాపకశక్తి వస్తుంది. బస్సు ప్రయాణాల్లో జరిగిన విషయాలు, అతని మనస్సులో మెదిలే అస్పష్టమైన వూహాలు, యీరెండూ కలిసిపోతాయి యీ రచనలో. నాయకుడు సంస్కారం గలవాడు. ఇంటర్ వ్యూకి సిద్ధపడటంకోసం కాబోలు మళ్లా పుస్తకాలన్నీ వొకసారి తిరగవేశాడు. వల్లెవేసిన యీవిజ్ఞాన భావపరంపరలు నాగరికత గందరగోళాని! చలించి ముక్కలై అధోలోకపు ఉద్రేకాలతో కలిసిపోతాయి. పెద్ద అక్షరాలలో సూచించ బడిన భాగాలు బాహ్యజగత్తులో

జరిగిన సంఘటనలు, మిగతావి చైతన్యస్రవంతి. ఆ ప్రవాహం పోకడని గమనించ దలిచిన వారికి యీ వ్యాఖ్యానం తోడ్పడు తుంది. ఆభావాలు ఆఉదాహరణలు ఆవ్యక్తికి ఆసందర్భంలో సమం జసమైనవో కావో పాఠకులే నిర్ణయిస్తారు.' మెదడుకి చక్కిలిగింతలు పెట్టడం, పాండిత్య ప్రకర్ష, యీరెండు మాత్రమే కాదు యీరచన ఉద్దేశ్యం. వొక పరిస్థితిలో మనవాంఛలు భావాలు, యెల్లా, యెక్కడ ఉద్భవిస్తాయో, యెందుకు. యెక్కడ అంతమొందు తాయో, పరిశీలంగా పరామర్శించినప్పుడు కలిగే వొక అనుభూ తిని కలుగజేస్తే దీనికైనా కొంత విలువ ఉందను కొంటాను.

స్కెచ్

# ఇంటాయన X ఐదు

ఇంతకీ యిది కథో, జీవిత చరిత్రో, లేక వుత్త చెత్త వ్యాసమో తెలీక యిల్లా నామకరణం చేశాను. ఇంటాయననగానే, నేనో స్త్రీననీ ఆయన నా భర్తనీ మాత్రం నిర్ణయించకండి. స్వతంత్ర భారతంలో నేనొక మొగాణ్ణి. నాకొక భార్యకూడా వుంది. నేనో కొంపలో వుంటున్నాను. దాని ఆసామీ, 'యజమాని' — 'లాండ్ లార్డ్' ఇంటాయన.

నేనీ పాతికేళ్ళల్లో ఐదు కొంపల్లో వున్నాను. కాబట్టి, ఐదుగురు ఇంటాయన్లు గలవాణ్ణి- ఏదో, పిల్లలు గలవాణ్ణన్నట్లు! ఈమధ్య వో విషయం ఆలోచించాను. ఈ ఐదుగురు యజమాన్లు, అన్నదమ్ములేనట, ఏంచెయ్యను? 'ఇంటాయన X ఐదు' అవక తప్పింది కాదు.

ఇంటాయన సన్నిధానంలో, సర్వస్వతంత్రాలకీ తిలోదకాలొదిలి, బైరాగుల్లైతే కడగండ్ల పాలవుతున్న దౌర్భాగ్యపు కాపురాల కున్న వాళ్ళతో ఏకీభవించి, సానుభూతి ప్రకటించి ఇంటాయన్లపై కత్తికట్టి, దెబ్బలు తీస్తూ పత్రికలకి, వ్రాసి వాళ్ళని నిర్మూలం చెయ్యడానికి వొక విప్లవం, వొక రాజకీయోద్యమం లేవదీయ సంకల్పించిన ధీరోదాత్తుణ్ణనుకుంటే మీరు పొరబడుతున్నారు. X గుర్తు, ఇంటి యజమాని పీక కత్తిరించే 'కత్తిరి" నిగూఢ ట్రేడ్ మార్క్ వుద్యమ 'చిహ్నం' అనుకోవద్దు. నాకట్లాంటి అనాగరికమైన, ప్రాచీన కొండమనుషుల భావాలులేవు. నేను ఆధునికుణ్ణి. అంటే స్వార్థ పరుణ్ని. నా సమస్య వేరు.

ఐదుగురి ఇంటాయన్ల విషయం క్లుప్తంగా చెప్పివేస్తే, నాస్వార్థ పరత్వం ఎట్లాంటిదో మీకే తెలుస్తుంది. మొదటాయన పేరు పంచేంద్రియం. ఆయన్ని నేనెప్పుడూ చూళ్ళేదు. అసలాయన్ని చూసినవాళ్ని

కూడా నేచూళ్ళేదు. ఆయన ఏదేశంలో వుంటాడో కూడా చాలా మందికి తెలీదు. నిజంగా ఆయన బ్రతికే వున్నాడంటే నమ్మడానికి కాస్త సందేహిస్తాను. మరి అద్దె ఎవరికివ్వను?

"ఈ గృహం నాది; నేనే యింటాయన్ని, అద్దినాకియ్యి." అని ఆంధ్రదేశంలో వొక్కరూ నాతో అన్లేదు. నాకు సిగ్గేసింది. అద్దెలే కుండా, ఎట్లావుండను? "నీచుడా—సిగ్గులేదూ? పో వెళ్లు. దేవుడు కోసం తీర్థయాత్రలు చేస్తావు; ముక్తికోసం ఆసనాలేస్తావు; మోక్షం కోసం జపం చేస్తావు. ఇంటాయన్ని కనుక్కోలేవు? పో — ఖాళీ చెయ్యి. అద్దెపుచ్చుకునే మహానుభావుణ్ని వెదుక్కో—" అంది, అంతరాత్మ. తక్షణం ఖాళీచేశాను, ఐదేళ్ళ తర్వాత.

రెండో ఆయన పేరు పంచప్రాణం. నేనంటే ఆయనికి పంచ ప్రాణాలూను. ఆయనది పెద్దయిల్లు. అసలు యిళ్ళల్లో 'పెద్ద'ంటూ లేవంటే నేచెప్పలేను. ఇంటి వైశాల్యం కుటుంబ విస్తీర్ణతని బట్టి వుంటుందని ఒక ఇటలీవాస్తుశాస్త్రకారు డన్నాడు. సంత జనంగల కుటుంబానికి గవర్నర్‌గారి భవనం ఇరుకే. మేము లింగులింగు మంటూ యిద్దరం. అందులోనూ మా ఆవిడ మంచం బద్దీఅంత మనిషి. పెద్దహాల్లో కుర్చీలో కూచుంటే కనబడదని మూల గదిలో చాపేసి 'కూకుంటుంది'. ఆ యింటికి అన్ని హంగులూ వున్నవి.

ఆ యింట్లో మా ఆవిడెక్కడుంటుందో ఎవరేనాచెప్పగలిగితే సగంవాటా అద్దికిస్తాను ఇంతకీ ఇంటాయనకీ నాకూ పేచీ, సగం వాటా అద్దెకివ్వడంలో వొచ్చింది. ఇల్లు అంతే అనుకోండి. దాన్ని నాలు గెట్టి గుణించండి. ఎందుకంటే అది నాలుగంతస్థుల మేడ. "ఇంతిల్లు నాకెందు కయ్యా, కింద వాటాలో మేముంటాం. మిగతాది ఎవరి కేనా, మీయిష్టంవొచ్చిన వాళ్ళకి- ఇన్సూరెన్సు ఏజంట్లకి తప్ప—. యివ్వండి." అని ప్రాధేయ పడ్డాను. బ్రతిమిలాడాను. మాపై. అధికారి చేత వ్రాయించాను. ప్రధానమంత్రి అంతరంగిక సెక్రటరీచేత చెప్పించాను. రెంట్ కంట్రోలర్‌తో ఫిర్యాదు చేశాను. ఔన్‌ప్లా

నింగ్ కమిటీకి వ్రాశాను. ఎసెంబ్లీలో బిల్లు ప్రతిపాదించమని మెంబర్లని కోరాను. ఇన్ని చేసినా, మా పంచప్రాణంగారు వినలేదు.

"నువ్వంటే నాకిష్టం. హాయిగా అనుభవించు. వాళ్ళకీ వీళ్ళకీ యివ్వడం నాకిష్టం లేదు. వాళ్ళకి ఇళ్ళల్లో కాపరం ఎల్లా వుండాలో చేతకాదు. నువ్వు గొప్ప కాపరం గాడివి."

అంటూ నవ్వేసి వెళ్ళిపోయాడు. ఏంచెయ్యను? మాఆవిడ వొక సలహా యిచ్చింది. "ముగ్గురు వాటాలూ ముగ్గురికి అద్దెలకి మనమే యిచ్చి ఆడబ్బు వసూలు చేసుకుని హాయిగా ఆనందిద్దాం. అదే మార్గం." అంది.

బుద్ధి గడ్డితిని, ఆ సలహా అంగీకరించి, ముగ్గురు వాటాదార్ల కోసం దేశం గాలించడం సాగించాను. చిత్రం, వొక్క డూ రాలేదు. "అద్దెలేకుండా వొచ్చి కాపరం వుండాల్సిందోహో" అని టముకు వేయించాను. జనం రాలేదు. ఇదేదో కుట్ర అనుకున్నారుట.

"నువ్వు ఇంటి యజమానివా?" అని అడిగారు జనం.

"కాను."

"మరి అద్దికిచ్చేందుకు నువ్వెవడవు?"

కాబట్టి, పంచప్రాణం గారే శరణ్యం. ఆఖరికి వొళ్లుమండి, మిగతా యిల్లు మరొకళ్లకి అద్దెకివ్వకపోతే, యిల్లుఖాళీ చెయ్యాల్సి వొస్తుందని బెదిరించాను, తత్క్షణం ఖాళీచేశాను—ఐదేళ్ళకి.

నామూడో ఇంటిజమాని పేరు పంచమహాపాతకం. ఆయన చేసిన అపచారం ఏమీలేదు. ఆయనింట్లోనే కాపురం వున్నాను. అదిబాగా పాతిల్లు. హిందూదేశ చరిత్ర జాగ్రత్తగా, వొళ్లుదగ్గరెట్టు గుని చదివిన వాణ్ణికాను; అంచేత ఆ యిల్లు యేకాలం నాటిదో నేను నిర్ణయించలేను. ఇక్ష్వాకుల నాటిదా? ఏమో! రాములవారు సీతాదేవి అరణ్యవాసం చేసిననాటిధనడానికి తార్కాణం వుంది,

అంజనేయులు, లేక అతని అనుచరులు, ఆ యింట్లోనో, లేక ఆయిల్లు వున్న స్థలంలోనో, అవొక్క పుట్టినా మకాం చేసివుండాలి. ఎంచేత నంటారా?

మా యింటిమీద వో డజను కోతులబృందం విడిది చేస్తాయి. దేశంలోవున్న కీటకజాలం మచ్చుకొకటి చొప్పున చూరుని అంటి పెట్టుకొని వుంటుంది. సృష్టికి పూర్వం, జీవకణువులోంచి ప్రథమ ప్రాణి వుద్భవించి, వివిధ రూపాలుగా పరిణామం చెంది, తుదకు మానవుడుగా అవడం వరకూ జరిగే ప్రాణుల జీవిత నాటకంలోని మధుర ఘట్టాలన్నీ మావొక్క వంటింట్లోనే తిలకించవచ్చు. ప్రకృతికి 'కళా' ప్రాతిపదికన్నట్లే, ఆ ప్రాచీన, ప్రాకృతిక వైభవానికి మా ఆవిడ ప్రకర్షించిన శిల్ప నైపుణి, కళా చమత్కృతి, నూత్న వైభవాన్నీ, వొక కొత్త చైతన్య శృంగారాన్ని ఆపాదించిందనడం సమంజసం. కుంపటి కోసం వుద్దేశింపబడ్డ బొగ్గులు అందులో తప్ప, యిల్లంతా తాండవిస్తాయి. వృద్ధనారి తలలో నెరసిన శిరోజముల వోలె, బూజులు ఇంద్రజాలాన్ని అల్లుతాయి. ఓహోహో! ఏం వైభవం! ఏమూల చూసినా, చినిగిన బట్టలే, ఏకింద చూసినా, దుమ్ము, దుఠ్ర, దూగరా, ఏపైన చూసినా, ప్రచండ అగ్నిజ్వాలా నీడలే! ఏమని వర్ణింతురా, ఎట్లు వర్ణింతురా, నా త్యాగరాజా!

పంచమహాపాతకం గారితో వొకటే చిక్కు. ఆయన చాలా మంచివాడు. చెడ్డవాళ్ళని గురించి అడ్డమైన వాడూ లెక్చర్లు దంచుతాడు గాని, మంచి వాళ్ళవల్ల దేశానికి, మానవాభ్యుదయానికి జరిగే హానిని గురించి, సంక్రమించే అరిష్టాన్ని గురించీ, వొక్క వాజమ్మా నోరు పెగల్చడేం! మరి నావొళ్లు మండుతోంది. లేకపోతే పంచమహాపాతకం అల్లా అనగలడూ! 'నాయినా, నీకు మరో కొత్తయిల్లు కట్టించి యిస్తాను. అంతవరకూ యీయింట్లో ఎల్లానో రోజులు వెళ్ళబుచ్చు' అన్నాడు.

"ఇంతద్దియిచ్చుగుంటూ అంతవరకూ యీయింట్లో వుండమంటావుటయ్యా" అన్నాను.

ఆయన వొక్క మహాపాతకం మాత్రం నవ్వినట్లు నవ్వాడు. 'ఇట్లాంటిల్లు ఎల్లా కట్టించావు? ఎప్పుడు, ఎవరు కట్టించారు?' అంటూ ప్రశ్న పరంపర కురిపించాను. 'ఈ యిల్లు నాదికాదు. మరొకరి దగ్గర అద్దెకుచ్చుకున్నా మీకోసం. నేను కట్టించే యిల్లు నెలరోజుల్లో పూర్తవుతుంది. అంతరకూ ఎల్లాగో గడపండి, ఈ యింటికి మీరు అద్దెకూడా యివ్వొద్దు. నేనే యిచ్చుగుంటాను.' అని వెళ్ళిపొయ్యాడు ఆయన. ఏం చెప్పమంటారు? ఈయన కథ యిల్లావుంది. నాకిదేదో పన్నాగంలా కనబడసాగింది. ఇంత మంచివాళ్ళుండటం, నిజంగా దేశానికి నష్టం, మంచితనంపైన ఏదైనా పన్నుంటే బాగుండు నని పించింది. నాకు పుట్టబొయ్యే అబ్బాయికి, వాళ్ళమ్మాయిని యిద్దా మన్న యత్నం కాదుకదా, కొంపతీసి! పోనిద్దురూ, తీసేటందుకు మనకి కొంపెక్కడేడిసింది అని మా ఆవిడ తన జన్మకల్లా వొక్క ఛలోక్తి నామీద ప్రయోగించి బొగ్గుల నృత్యానికి బూజులగజ్జకట్టి కాలని కట్టెల చుంమ్ చుంమ్ సంగీతంలో శృతి కలుపుతూ, గరిటి సంబరంలో నిమగ్నురాలైంది.

నా బుర్రలో—బూజు దులిపింతర్వాత సుమాండి-వొకగొప్ప భావం ప్రవేశించి, స్థావర పడింది. వెంటనే అచరణలో పెట్టాను. అచ్చాఫీసు కెళ్ళి కొన్ని ఆహ్వాన పత్రాలు అచ్చొత్తించి తీసు కొచ్చాను.

"అయ్యా! అమ్మా, నేడు సాయంత్రం 4 గంటలకి మర్కట లగ్నమున, నేనూ, నా సతీమణియు, మాయింటి యజమాని మా కోసం కుదిర్చిన, గృహంలో గృహాలంకరణ మహోత్సవం జరుపుటకు, పెద్దలు నిశ్చయించిరి గావున, ఏ తత్శుభముహూర్తమునకు తాము యథాపరికరములతో విచ్చేసి, వుత్సవము జయప్రదముగా సల్పి, మదర్పిత బొగ్గు, బూజు, దుమ్ము, దుప్ప, కీటక సంపదను గైకొని, మమ్మానందింప జేయ కోరుచున్నాడ.

ష.రా "మీమీ,తట్లీలు, చీపుళ్లు, గంపలు, జల్లెడలుమీరే తెచ్చుకో ప్రార్థితులు."

ఆహ్వానాలు వో యాభై అడ్రసులు వ్రాశి సిద్ధంచేశాను. అది చూసి మా ఆవిడ ఆనందానికి మేరేలేదు. ఆకస్మిక ఛాయా చిత్రం లాగ, చేతిలోగరిటని, మూలపడవైచినదై. సంభ్రమముతో అరుదెంచి, ఇట్లు చెప్పదొడంగె:

"ప్రభూ, నాచేత కాదగిన కార్య కలాపమంతయూ, పలువురు పుర ప్రముఖులకి పంచుట మీ సౌదార్యము చాటుచున్నది. రేపీపాటికి మనగృహ మెట్లుండునో వూహింప నోపునె!"

ఊహించడంలో నిమగ్నుల మయ్యాము. అహహా! మాఆహ్వానాలు అందుకోగానే, స్నేహితులు, బంధువులు వొచ్చేసి యిల్లంతా శుభ్రపరుస్తారు. ఎవరెవరికి, ఏమేం పనులు పురమాయించాలో నిర్ణయం చేసుకున్నాను. నామిత్రుడు శరభయ్య మాసిక బట్టలన్నింటినీ వొకదరికి చేరేసి, బొత్తిగా పనికి మాలిన వాటికి నిప్పు పెడతాడు.

కృష్ణావతారం, చినుగులు కుడుతాడు. రాఘవమ్మగారు దుమెత్తి పోస్తారు. హనుమాయమ్మ గారికి తేలువిషం ఎక్కదుట. అంచేత తేళ్ళని చంపి పోగు చెయ్యడం ఆవిడపని. మరి బూజులో- నాప్రాణ స్నేహితుడు గురుమూర్తి,- బూజుల విషయంలో, వాడు కేవలం పరమాత్ముడే- సిగరెట్టుపొగతోనే వాటిని భస్మీభూతం చెయ్యగల్డు. అతని సతీమణి, రమణమ్మ గారు ఆమె కోమల హస్తంతో ఆ బొగ్గుల మసిని తుడిచి వేస్తుంటే, ఓహోహో!

నేనో పాతికా, ఆవిడో పాతికా-- రమణమ్మ గారుకాదు, మా ఆవిడన్నమాట- ఆహ్వానాలు తీసుకుని, నలుగురికి స్వయంగా యిచ్చి, పిలవడానికని వూళ్ళోకి బయలుదేరాము. ఇంటికొచ్చేటప్పటికి, మధ్యాహ్నం మూడున్నర దాటింది. అతిధులందరూ, మరోపావు గంటలో విచ్చేయ నున్నారు. అమితోత్సాహంతో, కొంపలోకి తలుపు తీసిప్రవేశించాంగదా, మమ్మల్ని ఎదుర్కొన్న దృశ్యం ఎట్లాంటిదని మీవూహ!

ఇల్లంతా, శుభ్రంగా, అద్దంలాగ చేశేశారు ఎవరో. మడత దుప్పటిలాగ, ఫ్లాస్క్‌లో వాక్యూమ్‌గ్లాస్‌లాగ, ముత్యంలాగ, చంద్రుడిపై తెల్లమేఘంలాగ, ఇల్లంతా కడగబడి, ముగ్గులెట్టబడి, అలకబడి, సున్నంకొట్టబడి, సూర్యోదయంలా గుందంటే నమ్మండి. దొడ్లో నుయ్యుంది తెండి. నాసంకల్పం మా గురుమూర్తిని అందులోదించి నీళ్ళు తోడించాలని, అదొక మహాస్తరమైన దిగుడు బావి. భూగోళ శాస్త్రం పరీక్షలో యిట్లాంటి ప్రశ్న అడుగుతుంటారు. "నూతులో చేద వేస్తే, న్యూయార్క్ పట్నంలో ఆచేద తేలింది. దీన్నిబట్టి అనుయ్యి ఏపట్నంలోదో కాకపోయినా, ఏదేశంలోదో చెప్పుకోండి? మీకిచ్చిన ప్రపంచ పటంలో ఆపట్నం దగ్గర గుర్తుపెట్టండి" అని అడుగుతారు. దానికి సమాధానం మాదొడ్లో నుయ్యి. ఇల్లంతా శుభ్రం చెయ్యడం కాకుండా ఆనూతులోంచి నీళ్ళుతోడి అరడజను గంగాళాలు నింపారు ఎవరో. ఈ దురంతం చేశిందెవరు? ఎవరైనా క్షమార్హులు కారు. క్షణంలో నలుగురు అతిధులూ వొస్తారు. నావనేంగాను ! ఎంత పరాభవం ! ఏదీ మీబొగ్గుల దొంతరంటే ఏంచెప్పను? బూజులేవమ్మా అంటే మా ఆవి డేమనగల్దు ? అన్నీ గతించినై ; ఆ తేళ్ళపరంపరలు, ఆ బొజ్జింకల వయ్యారపు సముదాయము; ఎలుకల మందహాసము; సాలీండ్ల మూగతపస్సు; మాసినబట్టల స్థానచలనము- అన్నీ నశింపు. మా కేది దిక్కు? ఏది దోవ? నేను మా ఆవిడా, గోదావరీ, కృష్ణా, యీ రెంటిలోనూఎవరు ఎందులో పడటమా అనే విషయం తర్కించు కుంటుండగా వొకచిరునవ్వు వినిపించింది. వొకటికాదు, రెండు చిరునవ్వులు. వాటిని వుద్భవింప చేసినవారు, పంచమహాపాతకం గారు, ఆయన సతీమణి.

"మీరు పడుతున్న అవస్థ చూడలేక, మీరు యింట్లోలేని సమయంలో నేనే యిదంతా శుభ్రం చేయించాను. మనకొత్తిల్లు వారంలో సిద్ధం కాబోతోంది. ఈవారం యిక్కడే నిశ్చింతగా గడపండి" అన్నాడాయన. ఏనాడు నామకరణం చేశారో పెద్దలు, ఆయన్ని తల్చుకుంటే పంచమహాపాతకాలు పట్టుకొని, ఎముకల్లోకి జీర్ణించి

పీడించి, మసిచేసి వొదిలి పెట్టాయా అనిపించింది. పైగా ఆ చిరు నవ్వు చూడండి!

"ఇలా నాతోరండి" అని నన్ను వీధిలోకి తీసికెళ్ళాడు.

"అల్లాపైన చూడండి"

చూశాను,

ఏమీ కనబళ్ళేదు.

"ఇంతేనా, మీ జ్ఞాపకం. ఇదివరకెన్ని కోతులుండేవో మరిచి పోయ్యారా తరిమేశాను."

దాంతో కత్తి నాగుండెలోకి పోవడం, మెలితిప్పడం సమాప్తం. ఈనీచుడితో నా కేల.... ఛీ. అనుకుని, ఆసాయంత్రం యిల్లు ఖాళీ చేశాను— అంటే ఆవారాంతం వోసాయంత్రం అన్నమాట.

ఇహ మా నాలుగో ఇంటాయన్ని గురించి చెప్పటానికి నాకు వోపికాలేదు, పున్నా తీరుబడీలేదు. ఎంచేత నంటే, ఆయనింట్లో నేనున్నది సరిగ్గా మూడుగంటలు. వివరాలు నాకు బాగా జ్ఞాపకం లేవు. ఆయన రాసిన వుత్తరంముక్క చూసుకుని, నేనూ, మా ఆవిడా వొక రెండెడ్ల బండిలో సామాన్లు వేసుకుని మరో వొంటెద్దు బండిలో మేంఎక్కి అడ్రసు ప్రకారం వొక యింటిముందు దిగాం' వీధి గుమ్మం మూసివుంది, పక్కన బుల్లికిటికీ వుంది.— ఎంతలెండి యుద్ధకాలంలో వొచ్చిందే అగ్గిపెట్టి - అంత; - ఆ కిటికీలోంచి ఓ యాభై తలకాయలు తొంగిచూశాయి.

"ఖాళీలేదు వెళ్ళండి ఘేంవచ్చేశాం" అని బృందగానం సాగించాయి.

"నేను యింటికోసం రాలేదు. ఇంటాయన కోసం వొచ్చాను." అన్నాను నమ్రతతో.

"ఆయన పేరు?" అన్నాయి ఓ అరడజను తలకాయలు.

"పంచాంగం" అన్నాను.

ఆ తలకాయలు నవ్వినవ్వి మాయమయ్యాయి. మా ఇంటాయన పేరు పంచాంగం. దానికి నేనా బాధ్యుణ్ణి. వారింట్లో కాపరం వుంటూ, ఆయన పేరు చెప్పేటప్పటికే విరగబడి నవ్వడమా? ఎంత అన్యాయం!

పంచాంగంగారు ఆ వెనకవీధిలో వుంటున్నారు. బళ్ళు వెనక్కి మళ్ళించి, పంచాంగం గారింటికి చేరుకున్నాం. ఆయన అరుగుమీద కూర్చుని చుట్ట నములుతున్నాడు. ఆయనమీదికి తారాజువ్వలా వెళ్లాను:

"ఏం పనయ్యా ఇంట్లో ప్రవేశించమని అంత్రకితమే మరొకర్ని ఆయింట్లో ప్రవేశ పెడతావా. ఇదేనా పెద్దమనిషితరహా. చూడు నీవిషయం కనుక్కుంటాను" అన్నాను. అంటే అచ్చంగా యింత కఠినమైన మాట ప్రయోగించ లేదనుకోండి. తత్తుల్యమైన భావం ప్రకటన చేశాను. పంచాంగం చుట్టతీసి నవ్వి, 'ఒసే' అని కేకేసి, పడక కుర్చీ వేసి కూర్చోమన్నాడు. సగం పంచాంగం—(అంటే ఆయన భార్యలెండి) మరచెంబు, గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చింది. వీధిలోకెళ్లి మాఆవిణ్ని బండిలోంచి దించి, లోపలికి తీసుకెళ్ళి కాళ్ళుకడిగి పసుపు పారాయణ పూసి, హారతిచ్చింది. అరిసెలు, అప్పాలు, అరడజను మొక్కజొన్న పొత్తులు వెండి పళ్ళెంలో తెచ్చి నాముందు పెట్టింది.

"ఇదిటయ్యా నువ్వు చేసేపని. చెప్పేదొకటి చేశేదొకటీనా?" అన్నాను, కోపందిగమింగుకోలేక.

"తరవాత మనవిచేస్తా, ముందు భోంచెయ్యండి." అన్నాడు పరమపంచాంగం.

నేను ఫలహారం చేస్తున్నా, సంస్కారం, నాకరికతగల అధునికుణ్ని కాబట్టి. మరోలైతే, ఆ పొత్తులు ఆయన మొహానకొట్టి మరీ వెళ్ళును.

''మీకు రాసిన వుత్తరం ఆయనకి వెళ్ళిందిట. ఆయనదీ మీదీ వొకటేపేరుట. మీరు మళ్ళా రెండుమూడుత్తరాలు వ్రాశారు. ఓవేళ నా వుత్తరం అందలేదేమో అని, మళ్ళా మొన్న వ్రాశాను. ఆవుత్తరం సరిగ్గానే చేరిందన్న మాట, పోస్టువాడు యిప్పటికేనా నిజం తెల్సుకున్నందుకు సంతోషించాల్సిందే.''

''పేరువొంకని ఆయూభై తలకాయల కుటుంబంగాడు అందులో ప్రవేశిస్తాడా ? వాణ్ని బైటకి తోలెయ్యలేరూ, ఇంటియజమాన్లుగా." అన్నాను.

"పోనిస్తురూ పాపం. ఇల్లులేక ఎంత అవస్థపడుతున్నాడో."

నావొళ్ళు మండడం సాగించింది. చూడండి, స్వార్థరాహిత్యం వల్ల ఎంతకీడు వాటిల్లు తోందో.

"మరి నా మాటేం చెప్పారు?"

''భగవానుడి కృపుండాలిగాని, అన్నీ చక్కపడతై. నేనన్నీ ఏర్పాటు చేస్తాగా.''

''మీకు మరోయిల్లుందా?''

"మీ కెందుకు, ఆ సమస్యనాకు విడచి పెట్టండి'' పంచాంగం వీధిలోకెళ్ళి నలుగురు ఉక్కులాంటి మనుషుల్ని పోగుచేసి, బండిలో సామానంతా, ఇంట్లో పెట్టించాడు. నాకర్థంకాక ఆశ్చర్యంతో చూస్తూ అరికాలు తింటున్నాను.

ఇంట్లోంచి, తన సామాన్లు వొక్కొకక్కటే, వీధిలోకి చేరేస్తున్నాడు. మంచాలు, బల్లలు, కవ్వం, రోకలి, రెండు జల్లెళ్ళు, ఐదు ట్రంకు పెట్టెలు, గంపలు, మాసిన బట్టలమూటలు సర్వమూ బైట జేరేయించాడు. మేం దిగిన రెండెడ్ల బండిలో పెట్టిస్తున్నాడు.

''ఒకసారి తమరు లోపలికి దయచేస్తారా - కాస్త శ్రమనుకోక" అన్నాడు.

అదంతా స్వప్నంలాగుంది. లోపలికెళ్ళాను. నలుగురు వుక్కుమనుషులు, ఆయనా కలిసి మధ్యహాల్లో భోషాణాన్ని కదల్చడానికి యత్నిస్తున్నారు. నన్నూ వొకచెయ్యి వేయమని అడిగాడాయన. "ఇవన్నీ ఎక్కడికి చేరేస్తున్నారు?" అన్నాను.

"నేను నిజాయితీగల పెద్దమనిషిని. అడినమాట తప్పను. మీకు ఇల్లు యిస్తానన్నాను. ఇచ్చితీరతాను. మీరు మా యింట్లో వుండండి......?"

"మీరో......"

"నామాటకేం. భగవానుడున్నాడు. ఏచెట్టు నీడకో చేరుకుంటా - ఇల్లు మెల్లి మెల్లిగా అదే దొరుకుతుంది" అన్నాడుఆయన.

ఇదేం కర్మ !

"అల్లా వీల్లేదు. నలుగురూ ఏమను కుంటారు?"

"ఏమను కుంటారు, అద్దెకోసం యజమాని వనవాసం చేస్తున్నాడనుకుంటారు. అసలందుకే ఇల్లు కట్టుగోడం. తమకి తెలియందేముంది లెండి. పోనీ భోషాణం యిక్కడే వుంచుతాను. తమరేవాడుకోండి."

ఆ చివరి వాక్యంతో, నాపొత్తి కడుపులో బల్లెం గుచ్చినట్లైంది.

"ఇంకానయం. మీరే వుండండి. నేను మా ఆవిణ్ని పుట్టింటికి పంపేసి, ఏదో హోటల్లో గడుపుతాను." అన్నాను.

అల్లా ఎంతమాత్రం వీల్లేదు. పైగా మీ యిష్టమా ! భగవానుడి ఆజ్ఞ వుండాలండోయ్..."

నేను వంటింట్లోకెళ్ళి మా ఆవిణ్ని బరబరా యీడ్చుకొచ్చి వొంటెద్దుబండిలో ఎక్కించాను.

"ఎక్కడికి ప్రయాణం?" అన్నాడు.

"ఇప్పుడే నదిలో స్నానంచేసి వొస్తాం. తోల్రాబండి.'' అన డంతో బండి కదిలి, అప్రతిష్టపాలవడం తప్పించుకున్నాం. నదిలో స్నానానికని ఆయనతో చెప్పినా, నాకు మళ్ళా యివతలకొచ్చే సంకల్పంలేదు. అట్లాంటి సందర్భాలలో ఆత్మహత్య తప్ప, మరి గత్యంతరంలేదు. పంచాంగం అన్నట్లు, యివన్నీ మనిష్టమా - భగ వానుడి ఆజ్ఞకావాలి. అంచేత ఆత్మహత్యలాంటి వెర్రివెర్రి వేషా లెయ్యక, ఉన్నగా ఆవిడను పుట్టింటికంపి, నేను హోటల్లో మకాం చేశాను.

ఇది 1946 మాట. పంచభూతంగారింట్లో కొత్తకాపరం - నేనూ మాఆవిడా, వంటమనిషి, పసిపిల్లా, రెండు పిల్లులూ. అద్ది పాతికరూపాయలు. అన్ని విధాలా మంచిల్లు. పంచభూతంగారు పక్కవీధిలో వుంటున్నారు. పేరాలు లేకుండా కులాసాగా సంవత్స రం గడిచి పోయింది. 1947 ఆగస్టు వొచ్చింది.

దేశానికి స్వతంత్రంవొచ్చింది. నాకూ వో ఆడపిల్ల-ఎంతకాలం వూరుకుంటుంది చెప్పండి- కలిగింది. భూములు పుష్కలంగా పండా యి; ఉద్యోగం పెద్దదయింది. చేతులో బోలెడంత డబ్బు. మనమే ఇల్లు కడదాం; ఎంత కాలం అద్దెకొంపలు. పట్టుమంది కూడా, మా ఆవిడ. దేశవిభజనా, కాందిశీకుల సమస్య బైలుదేరిన సంగతి మీరం దరూ ఎరుగున్నదే. ఒక్కసారిగా దేశం అంతటా అద్దెలు పెరిగినయి. ఒకటో తారీకున అద్ది యివ్వడానికి పంచభూతంగారింటికి స్వయంగా వెళ్ళాను. ఆయన నలభై చేసినా యివ్వడానికి సిద్ధంగా వున్నాను. అబ్బే, ఆయన విషయం ఎత్తలేదు. వెడుతూ వెనక్కి తిరిగిఅన్నాను.

''మరి....మరి...అద్దెమాట?"

"ఇస్తిరిగా..."

''అ,...సరె....'' అని నవ్వుకుని వెళ్ళిపొయ్యాను.

తర్వాత వారం రోజుల్లో మాఇంటిని కొంత మరమ్మతు చేశా డు. ముందులాంటిది, వెనక 'అవుట్ హౌస్' సరంబీ, గిలాబా, అరె

కకాచెట్లు, బుల్లితోట, అందులో విహరించే పక్షులు, అవిబైటకి పోకుండా చుట్టూ వైర్ నెట్టింగు.

యీ భాగ్యం యివోచ్చునని నిర్ధారణ చేసుకున్నాను. ఆనెల ఆయనే మాయింటి కొచ్చాడు. వందరూపాయిల నోటిచ్చాను. పాతి కా తీసుకుని మిగతాడబ్బిచ్చేశాడు.

''చాలా బాగుంది ఇల్లుయిప్పుడు'' అన్నాను.

''ఏదో-- చేయించాను. మీకు సంతృప్తి గలిగితే అదేచాలు."

''మరి అద్దిమాటో''

''మామూలే''

"ఎక్కువ చెయ్యరు?''

"చెయ్యను.''

''అందరూ చేస్తున్నా."

''వాళ్లకు మతుల్లేవు. ఇచ్చేవాళ్ళకి గతుల్లేవు''

''మీరు బోలెడు డబ్బు యింటిమీద పెట్టారు. అది రాబట్టు కోరు?"

"నా ఇంటిమీదే ఖర్చుపెడుతున్నా గాని; వూళ్ళో వాళ్ళ యిండ్ల మీద కాదుకదా."

"మీరు అనుభవించడం లేదుగా."

'మీరనుభవిస్తే, నేననుభవించినట్టు కాదు?"

ఈ పెద్ద మనిషి నేం జెయ్యమంటారు? బోలెడుమంది పిల్లా జెల్లా పైగా. ఎల్లా గడుస్తుంది. నాకు జాలేసింది,

మరుసటి నెలలో వారింట్లో ఏదో కార్యం వొచ్చింది. నేనూ వెళ్ళాను. వొచ్చేస్తూ అన్నాను:

"నా మనస్సు వూరుకోడం లేదు. మీరు అద్దె ఎక్కువ చెయ్యాలి."

"చెయ్యను"

"బాగా ఆలోచించండి, రోజులు బాగాలేవు. మీకు గడవదు"

"అందరికీ గడిచినట్లే నాకూను."

"అప్పులపాలై పోతారు."

"దైవ కృప"

రామదాసులా నటిస్తాడేం, యీ పంచపిశాచంగాడు? నాకు నిద్రపట్టడం లేదు. బెంగతో మాఆవిడ మంచానపడింది. వాళ్ళింట్లో కథలూ కార్యాలూ జరిగినప్పుడు, బహుమతుల రూపేణా వాకేదో ముట్టచెబుదాం. బెంగెట్టుకోకు,- లేచి, తిరుగు - అని ఆవిణ్ని వూరడ బెట్టాను.

ఇంతలోకి మా అదృష్టవశాత్తు, హైదరాబాదు సమస్య చక్కావొచ్చింది. దేశంలో అందరూ, అద్దెలు నాలుగింతలు చేసి వూరుకున్నారు.

మా ఢాకినీభూతంగారు మాత్రం, అబాకూడా పెంచలేదు, నాకోభావం తట్టబోయి మానేసింది. అదేమిటో తరవాత మనవి చేస్తాగా.

మీకిదంతా చదవడం విసుగనినాకు తెల్సు. కాని ఏంచెయ్యను? ఈ నావిషాదగాధ విసుగెత్తించిందంటే ఆశ్చర్యమేమిటి? పైగా నగ్న సత్యం యీరోజుల్లో ఎవరికి రుచిస్తుంది చెప్పండి.ఇంతవరకూ వోపిగ పట్టినవారు, యీకాస్తాచదివెయ్యండి మరీ, అట్టే యిదవక ! ఇదే రసవత్తరఘట్టం.

మూడునెల్లక్రితం, అమాంతం మాపక్కింటాయన మా యింటికొచ్చి లబోదిబోమనిబుర్ర మాకొత్తగా సున్నంవేసినగోడకి కొట్టుకున్నాడు. ఏమిటయ్యా కథ అని అడిగాను.

"ఇంకేముంది? చిప్పా, కర్రా చేతికివ్వండి" అన్నాడు.

"నిదానించి చెప్పండి - మాగోడ చెడిపోతుంది."

"ఏంచెప్పమంటారు? మా ఇంటాయన అమాంతం అద్దె నాలు గింతలు చేసేశాడు."

"ఏం చెప్పమంటారు. హైడ్రోజెన్ బాంబ్ తయారైంది. అందుకుట."

"ఎంతధన్యుడవయ్యా - పిచ్చివాడ, సంతోషంతోటి పార్టీ యివ్వడంపోయి యిల్లా బెంబేలెత్తి ఎవరేనా ఏడుస్తారా! లే, లే, వెళ్ళి మొహం కడుక్కో" అని ఆ దీనుణ్ని పంపించివేశాను. బుజాన తువ్వాలు వేసుకుని, తొందరగా పంచభూతం గారింటి కెళ్ళాను.

"ఏమండోయ్ - ఇహ మీరు వూరుకుంటే లాభంలేదు. కొంప మునిగింది."

"దొంగలు గోడకి కన్నాలెట్టారా - పోనీలెండి, మళ్ళాగోడ లెట్టిద్దాం - యీసారి డిస్టెంపర్ చెయ్యించి,ప్లాస్టిక్ షీట్స్ వేయిస్తాగా"

"అదికాదయ్యా, హైడ్రోజెన్ బాంబ్ తయారైందిట."

"అవుతే."

"మీరు అద్దెక్కువ చెయ్యరూ?"

"దానికీ దీనికీ ఏం సంబంధం?"

"బాగానేవుంది. వొక్క బాంబ్‌తో మీ యిల్లు భస్మంఅవుతుంది. అది జరిగేలోపలే, మీ పెట్టుబడిసొమ్ము రాబట్టుకోవాలి. అంచేత దయచేసి యింటద్దె వందచెయ్యండి" అని బ్రతిమిలాడాను.

భూతం వికృతంగా నవ్వడం సాగించాడు. "పిచ్చివాడా - బాంబ్ లేస్తే, నేమా, నువ్వూమాత్రం వుంటామా? డబ్బుంటుందా? అందరం దుమ్ములో కలిసిపోతాం. వెళ్ళండి. వెళ్ళి రోజూ భగవద్గీత

పారాయణ చెయ్యండి." అన్నాడు. నేను సిగ్గుపడి, కొంపకి చేరుకున్నాను.

ఇందాక అన్నానే, వొక భావంవొచ్చి మానేసిందని, ఆభావం యీసారి లోపలికి జొరబడింది. అదేమిటంటే యీ సమస్య అంతర్జాతీయ సమితిముందుపెట్టి న్యాయంపొందుదామని. వెంటనే వొక ప్రణాళిక తయారుచేశాను. అందులో నిబంధనలు చూడండి.

1. ప్రతి యింటి యజమానీ ఇల్లు అద్దెకు ఇవ్వబడదని బోర్డు కట్టాలి.

2. ప్రతినెలా కాకపోయినా ప్రతి సంవత్సరమూ ఇంటద్దె ఎక్కువ చేసితీరాలి. ఏవిధంగా?

అ. పాతదైన కొద్దీ అద్దె పెరుగుతుండాలి.

ఆ. గోడలు లేకపోతే గోడకి 10 రూపాయిలు చొప్పున.

ఇ. కప్పక పోతే 50 చొప్పున.

ఈ. నేలమట్టం లేకపోతే 100 రూ. లు.

3. మరమ్మతులుఎప్పుడూ తలపెట్టకూడదు. ఆ ఖర్చుతో మరో యిల్లుకట్టించి మరో సంసారంనిలబెట్టవొచ్చు.

4. సాధ్యమైనంత వరకూ ఇంటాయన అద్దెకిచ్చిన వాటా దగ్గరలోనే కాపరంవుండాలి. స్విట్జర్లాండ్. కైరో, అలాస్కా, మాస్కోల కేసిమకాం చెయ్యకూడదు,

5. ఇది ఆఖరు నిబంధన—

ఇంటాయన అద్దెకున్నాయన్ని ఖూనీ చేస్తే ప్రపంచ కోర్టుకి మాత్రం విచారణ చేసే అధికారం వుంది. మిగతా కోర్టులకి లేదు.

అల్లాగే అద్దెకున్నాయనకి ఇంటాయన్ని ఖూనీ చెయ్యాలన్న సంకల్పం కలిగినట్లు ఋజువైతే, ఋజువిచ్చిన వాడినీ, సంకల్పం

కలిగినవారినీ, వరల్డ్ కోర్టు విచారణచేసి, ఋజువు కాకపోయినా, మరణదండన విధించే హక్కుంది.

ఇది తయారు చేసిన తర్వాత మా పంచభూతాన్ని చంపడానికి నిశ్చయించుకున్నాను. దైవం కలిసొచ్చింది. ఆ వుదయమే, స్టీఫెన్ లీకాక్ అనే వొక తోటి కాపరస్తుడు అమెరికాలో కాలేజి ప్రొఫెసర్, న్యూయార్కు పట్నంలో, అద్దె ఎన్నిసార్లు కోరినా ఎక్కువ చెయ్యని మిషమీద, తన ఇంటి యజమానిని పిస్తోల్‌తో కాల్చిచంపేసి పోలీసులకు పట్టుబడి పోయిన సంగతి వ్రాయడం. ఆ వ్రాసింది నే చదవడం జరిగింది. ఆ వింతగాథ ఆంధ్రదేశం మినహా ప్రపంచం అంతా చదివే వుంటుంది.

ఈ విషయంలో నేను ఆయన వ్యాసంలో సంగతులు దొంగిలించానని అనుకోవద్దని మనవి. చంపాలన్న సంకల్పం మాత్రం అది చదివింతర్వాత కలిగింది. మేమిద్దరం కలిసి, వొకర్నే చంపామని కూడా అనుకోవద్దు. ఆయనకి పిస్తోల్ లైసెన్సుంది. నాకులేదు. ఆయన మిట్టమధ్యాహ్నం హత్యచేశాడు. నేను నిశిరాత్రి చేశాను. ఆయన నేరం వొప్పేసుకున్నాడు. నే వొప్పుగోను. నేను పిరికివాణ్ణి, స్వార్థపరుణ్ణి. ప్రాణంపై తీపిజాస్తి. వెళ్ళి ఎల్లాగో ఆ పంచభూతాన్ని హత్యచేసి, రక్తం చేతులు కడుక్కున్నాను.

కొంప తీసి నిజమనుకుని నామీద కేసు పెట్టేరు! చంపతే దండి—చంపుదామన్న కసి అంతగా వుందన్నమాట. ఆ కసి తీర్చుకోడానికి అల్లా వ్రాశాను. అంతే!

ఇప్పటికైనా తెలిసిందా, నాస్వార్థపరత్వం ఎట్లాంటిదో!

కథానిక :

# వూడిన చక్రం - వాడని పుష్పం

నా కామధ్య కొంత డబ్బొచ్చిపడింది. దాన్ని ఒకరిక్షామీద పెట్టి లాభం పొందాలనుకున్నాను. స్నేహితులు నలుగురూ వొద్దన్నారు. రిక్షా నడిపేవాళ్లని నమ్మడానికి వీలు లేదన్నారు. ఒకరోజున నాలుగుడబ్బులు అదనంగా చేతులో పడగానే, రిక్షాని వూరవతల వొదిలేసి, గంట లైటు సీట్లు టాపుగుడ్డ వగైరా తీసుకుని పారిపోతారట. రాత్రి ఒంటిగా నగలతో రైలుదిగిన స్త్రీని దోచమల్లించి, ఏమారుమూలో హత్యచేసి నగలతో పారిపోతారు. వారంతా నేరస్థుల తెగకిచెందినవారు, ఇహ నే నెల్లాగూ సైకిల్ రిక్షా తొక్కలేను కదా, కాబట్టి కొని ప్రయోజనం లేదు'

మరేవిధంగా యీ డబ్బు వినియోగపరచడమా అని ఆలోచిస్తూ కూర్చున్నా మండువాలో. మండువా యిల్లూ చిన్నవేకాని, ఆరుసెంట స్థలంపైలెడుంది. చుట్టూగోడ, మధ్యలో గేటు. గేటుప్రక్కన మూలగా వొకచిన్నపాక. ఇంటివాళ్లున్నప్పుడు దాన్ని పశువుల పాకగా వాడేవారేమో తెలియదు. ఇప్పుడదెందుకూ పనికిరాదు. ఇప్పుడంటే టంగ్ క్లీనర్లొచ్చాయి కాని, నా చిన్నప్పుడైతే ఆతాటాకులు నాలిక గీసుకునేందుకు వుపయోగపడేవి. ఆపాక కన్నీ కంతలే. ఈసారి పెద్దగాలివీస్తే తప్పకుండా భూమట్టమై పోతుంది. ఆపాక ముందు వొచెట్టు. దానిమీద ఎర్రపూలు వికసిస్తున్నాయి. చాలా ఎర్రనివి. జీవిత పరిణామంలో ఆపూలకి ఆ ఎర్రదనం అబ్బివుంటుంది. కొన్ని యుగాల వెనక అంత ఎర్రగా వుండివుండవు. వాటికేసిచూస్తూ వా ధనార్జనకి సంబంధించిన ఆలోచనలు నాకు చిన్నతనాన్ని కలగచేశాయి. మనిషి ఆలోచనలు డబ్బుని గురించేకదా...

జీవితంలో అందమైనవి, ఆనందాన్ని కలగచేసేవి, కాని కర్చులేకుండా లభ్యమవుతాయి. పచ్చగడ్డిమీద పడుకుని ఆకాశంలో మేఘాలకేసిచూడటం, దాహమేసినప్పుడు లోతైన చెరువులో చల్లని

నీళ్లు త్రాగడం, వేసంగిలో బాగా ఆకలేసినప్పుడు కొత్తావకాయ పెరుగుఅన్నం తినడం, ఆరుబైట పడుకుని చందమామ వయ్యారం చూడటం. గాంధిగారి అంచనా ప్రకారం పాతికరుపాయలతో నెల జీవితం ఆనందంగా గడిచిపోతుంది.

ఆ ఎర్రపూలకు కొంచం దూరంగా పాకముందు, వొకరాతి బండ వుంది. ఆ బండకానించి వొక చక్రంవుంది. బండిచక్రం లాంటిది నిన్న లేదు, ఎక్కడిది ఆ చక్రం? అసలదేమిటి?

పాకలోంచి వో నల్లటివ్యక్తి మరోచక్రం వోబండి తీసుకొచ్చాడు. బండపక్క చక్రాన్ని ఆబండికి బిగించాడు. పూర్తయిన వాహనం రిక్షా. ఆనల్లటివ్యక్తి, రాతిబండమీద కూర్చుని, గడ్డాన్ని చేతిమీద ఆనించి దేనిగేసో చూస్తూ కూర్చున్నాడు. రోడిస్ అనేశిల్పి కంచులో చెక్కి పోతపోసిన "మేధావి"—అనే ప్రతిమలావున్నాడు. రోడిస్ శిల్పంలో వ్యక్తికిమల్లే కండలు తిరిగిలేదు. ఈవ్యక్తిది ముడతలుపడ్డ పల్చటి నల్లటి శరీరం. దాని కింక జీవితంలో పేచీవున్నట్లు లేదు. కోతికీ ఆదిమానవుడికీ మధ్య వొక ప్రాణివుండేదట. ప్రాచీన మానవశాస్త్ర పరిశోధకులకి అది యింతవరకూ లభ్యంకాలేదు. ఆ ప్రాణిసంతతివాడు, ఈవ్యక్తి రాత్రి వర్షంలో ఖాళీగా పాక కనబడితే వొచ్చాడు. అభ్యంతరం లేకపోతే వుంటాడు, నాలుగురోజులపాటు. మధ్య నా అభ్యంతరం దేనికి? అంగీకారానికి కొంత స్వార్థం లేకపోలేదు. వాడు ఆ పాకలో రాత్రిళ్లు వుంటే దొంగభయం వుండదు.

వాడే దొంగేమో? అర్ధరాత్రి నన్నేమన్నా చెయ్యడుకదా...

కాని వాడు అల్పుడు. అర్భకుడు. సృష్టికర్త తినిపారేసిన పుల్లిస్తరాకు. జంతుజాలం దిగవిడిచిన అంతిమచిహ్నం. సంఘం వూడ్చిపారేసిన మన్నుపుట్ట. మృత్యువు వాడిచుట్టూ వుచ్చుపోసింది, ఇంక లాగటం తరవాయి.

ఆవ్యక్తి నింకేమీ ప్రశ్నించలేదు. వాడికి తల్లిదండ్రులు, కుటుంబం, కొంప లేవా? వాడు మట్టిలోంచి రిక్షాతో సహాపుట్టాడు. అందు

లోనే కాపరం, అందులోనే చావు. మట్టిలో కలిసిపోతాడు. వాడి రక్తంలోంచి మరో ఎఱ్ఱనిపువ్వు పుట్టి వికసిస్తుంది. అది రిక్షాఘట్టం, రాజఘట్టం కాదు.

వాడి ఆలోచన ముగిసింది. ఆకలేసినప్పుడే వాడి ఆలోచన. చుట్టపీక తీశాడు. నిప్పులేదు అగ్గిపుల్ల గీశాడు. ఆకలేస్తే నిప్పుతింటాడు. వెడుతున్నాడు. వెళ్లాడు. నేలమీదపడ్డ యెఱ్ఱపువ్వు రిక్షాచక్రంకింద నలిగింది.

ఇందాక వున్నాడు, ఇప్పుడు లేడు. రిక్షాచక్రాలజాడలు నలిగిన పువ్వు, గాలిలో కలిసిన చుట్టనుసి. అంతే వాడి వునికికి నిదర్శనాలు. అంతే జీవితం.

ఆర్థికవేత్తలు ఎవడు సామాన్యమానవుడు? అని అడుగుతున్నారు. నాకింక సందేహం లేదు వీడే ఈ రిక్షావ్యక్తి. కాయకష్టం చేసి, అలసిన సామాన్యప్రేక్షకుని వినోదంకోసం చిత్రాలు తీస్తున్నాం అంటున్నారు సినిమావ్యాపారులు. అది మధ్యతరగతివారి భ్రాంతి. వాడు వినోదించడు, వాడిబ్రతుకే వినోదం. వేరే వినోదాలకి సమయంలేదు, వోపికలేదు. సినిమాహాళ్ళముందు వంటలాదిగా రిక్షాలు పడివుంటాయి. రిక్షావాళ్లందరూ వాటిమీదనో కిందనో పడివుంటారు. మన్ను వారి వెండితెర, మట్టిలో పురుగులు వారి అభిమాన నాయికానాయకులు, రిక్షా యెక్కేవారు వారి దర్శకులు. అణాలశేరం వారి కథావస్తువు.

ఆఫీసుటైము కాగానే యీ వింత ఆలోచనలు ముగిశాయి. నాపొట్ట నింపుకోడానికి నేనూ బయలుదేరాను.

  

ఆ సాయంత్రం నేను యింటికి వొస్తుండగా మా వీధిచివర వొక పెద్దగుంపుచేరింది. పెద్దలు పిన్నలు వొకరిద్దరు స్త్రీలు, వొక పోలీసు — మధ్యలో ప్రొద్దున్న మా యింటిముందు చూసిన రిక్షావాడు వున్నారు. ఏదేనా ప్రమాదం జరిగిందేమో చూద్దామని నేనూ

గుంపులో చొరబడ్డాను. మనుషులు, చెమట, వేడిపూపిరి. వింతధ్వనులు చుట్టుముట్టాయి. గాయపడిన మనిషిగాని, రక్తం గాని కనపడలేదు. అందరూ వింతగా చూసేవారే — మాట్లాడేవారే. విషయం యేమిటో చెప్పరు. పోలీసు ప్రక్కనేవో దవాలీబంట్రోతువున్నాడు. అతన్ని ఏమిటని అడిగాను. అతను సమాధానం చెప్పలేదు.

"అవుతే సంరా వొక మనిషి యెక్కువబరువా, యిద్దరుమనుషు లెక్కువబరువా" అని అడిగాడు రిక్షావాట్టి. "ఒకరే ఎక్కువబరువు" అన్నాడు వాడు. అందరూ విరగబడి నవ్వారు. పిచ్చోడా అంటూ పిల్లలు వాణ్ణి దుయ్యబట్టారు.

నవ్వడానికి బలమైన కారణం వుంది. "పిచ్చివాడు" అనుకోవ డంలో తప్పులేదు ఇద్దరు మనుషులకంటె, ఒకరే యెక్కువ బరువ న్నది సృష్టికీ ప్రకృతికీ విరుద్ధం. యూక్లిడ్, న్యూటన్, రామాను జమ్ మొదలైన గణితశాస్త్రజ్ఞులు ముక్కుమీద వేలు వేసుకోరూ, యీ "మేధావి" చేసిన సూచనకు! రెండు రెళ్ళు నాలుగన్నది స్వయం ప్రకాశమైన సత్యం. మేధావులున్నా లేకపోయినా దేవుడున్నా లేక పోయినా సృష్టి అనంతంలో కలిసిపోయినా ఆ సత్యానికి చలనం లేదు. అల్లాగే ఒకటికంటె రెండు బరువన్నది. కాని వాడు యూరోడిన్ "మేధావి" రెండుకంటే, ఒకటి బరువంటేవిజ్ఞానశాస్త్రం, లోకజ్ఞాన జగత్తు విస్తుపోక చేసేదేముంది? నవ్వుతారు, దుయ్యబడుతారు, యిది పాకిందంటే నలుగురూ యేకమై తంతారు. ఈ సామాన్య మానవుడు, యిల్లాంటి అసామాన్యమైన సిద్ధాంతాన్ని అమాయక సంఘం నెత్తిని రుద్దుతాడా?

దవాలీబంట్రోతు ధైర్యంగా ముందుకొచ్చి, "అది యెల్లాగో కొంచెం చూపించరా" అని రిక్షావాణ్ణి సంబోధించాడు. ప్రశ్న, సమా ధానం వింతగానే వున్నాయి. నా కుతూహలం ఎక్కువైంది. ఒక పెద్దమనిషి అగ్గిపుల్లకోసం అటూ ఇటూ చూస్తున్నాడు. అగ్గిపుల్ల ముట్టించి, ఆయన్ని దూరంగా తీసికెళ్ళి, యిదంతా ఏమిటనిఅడిగాను.

గంటక్రితం ఫ్యాక్టరీయజమానిగారి భార్య, పనిపిల్లని తీసుకుని బజార్లోకి బైలుదేరారుట, మరోరిక్షా కనపడక చిన్నపిల్లేకదా ఫరవా లేదనుకుని యిద్దరూ వాతిరిక్షాలో యెక్కారుట. పనిపిల్లకి పది పద కొండేండ్లుంటాయిట. అమ్మగారి కాళ్లముందు కింద గంపతోసహా కూర్చుందిట. రిక్షావాడు వాళ్లిద్దరినీ హాయిగా సునాయాసంగా మోసేశాడుట. మార్కెట్లో సరుకులు కొనుక్కుని గంప పిల్లనెత్తిన పెట్టి, ఇంటికి పంపించి, యజమానురాలు ఒకర్తీ, రిక్షాలో బయలు దేరిందిట.

ఫ్యాక్టరీదాటి వారి బంగళా చేరువలోకి రాగానే, రిక్షా పైకి వొదిలెయ్యడం, ఆవిడ రోడ్డుమీద పడిపోవడం, ఫ్యాక్టరీ జవాన్లు నలుగురూ వొచ్చి, ఆవిడను వొక జట్కాలో ఎక్కించి యింటికి పంపడం. రిక్షావాణ్ణి నిలేసి సంజాయిషీ అడగడం అదీ జరిగింది.

రిక్షావాడు ఆమెను పడెయ్యాలనే పడేశాడని, గుంపు తీర్మా నించింది. ఈతీర్పుకి ప్రబలమైన కారణాలున్నాయా? వున్నాయి. రిక్షావాడొకప్పుడు ఆ ఫ్యాక్టరీలో పనిచేశాడు. ఏ కారణం చేతనో వాణ్ణి పనిలోనించి తీసివేశారు. ఇన్నాళ్ళకి వాడు యజమాని భార్యపై పగసాధించాడు. ఓపికలేక పట్టుజారి వొదిలేశాడంటారా? అబ్బెబ్బె యీరిక్షావాండ్ల సంగతి మీకు తెలవదండి. వీళ్ళు ఎంతకేనా సాహసిస్తారు. అంత వోపికలేనివాడు అమ్మగారు పనిపిల్ల యిద్దరూ వుండగా పడెయ్యలేక పొయ్యాడూ ... అంతేకాదండోయ్ వెళ్లిన కొద్దీ లోతుంది. ఆ పనిపిల్లకీ వాడికీ ఏదో చుట్టరికం వుండచనా మీ ఊహ? చూడండి చిత్రం - ఆపిల్ల దిగింతర్వాతే, అందులో ఫ్యాక్టరీ దగ్గర్లో. యింకా ఏమిటి మీ సందేహం. ఒక్కమనిషే ఎక్కువబరువట. అదంతా ఏమిటో తెలుసాండి. ఆవిడది స్థూలకాయం - అదంతా, ఎగతాళన్నమాట. వినండి వాడిసమాధానం.

అంటూనే చుట్ట అవతలపారేసి డవాలి బంట్రోతు వెనక్కి ఆసామీ జోరబడ్డాడు. ఇద్దరికంటె వొకరెల్లా ఎక్కువబరువో యిప్పుడు

చెప్పమన్నారు. రిక్షావాడు తలతిడిమి చూసుకున్నాడు. చేతులు నలుపుకున్నాడు. దిగులుగా నాకేసి చూశాడు. "అర్నడగండి" అన్నాడు నాకేసి చూపిస్తూ.

"రిక్షా తోసింది నువ్వైతే అర్నడగడం ఏందిరా?" అని రెండు మూడు కంఠాలు లొకాయించాయి.

"నే నెట్టాంటవి చెప్పను" అన్నాడు రిక్షావాడు. నలుగురిలోనూ, నేనెల్లాగో అయిపోయ్యాను. వాళ్ళగురించి నాకేం తెలుసు? దేవుణ్ణి గురించి నాకెంత తెలుసో వాళ్ళగురించి అంతే. దీనికంతా నేను మద్దత్తు అనుకోరుగదా ... సమాధానం చెప్పకపోతే, పోలీస్ స్టేషన్ కి నడవమన్నారు.

వాడికి సమాధానం తట్టినట్టుంది. "చెప్పనాండి" ఆపిల్ల మట్టంగా గంపతో నడుంగా కూకున్నప్పుడు, అమ్మగోరు కదల గండా, కుదిమట్టంగా కూకుండిపోయినారు. అటుయిటు కదల్టానికి లేదుగా మరి...ఊగిసలాడ్డానికి లేదుగామరి—రిచ్చా, సమ్మగా కద లకుండా పోద్ది, ఆపిల్ల దిగేసరికి, ఆరొక్కరేగా. ఓస్వేచ్ఛ ! ఎనక్కీ ముంగలకి సూస్తం, ఊకిసలాడతం—పట్టుపడకవుద్ది? అంతుకని, ఆ రిద్దరూ వుండప్పుడు లాగడమే సుకం, అన్నాడు. జనం విరగబడి నవ్వారు. అది తర్కానికతీతమైన అనుభవం, రిక్షాలాగుతేగాని తెలవదు. ఆధునిక విజ్ఞానశాస్త్రం పురోగమిస్తోంది. నిన్న అవునన్నది యివాళ కాదనడానికి ఆధారాలు దొరుకుతున్నై. కొన్ని శతాబ్దాల పాటు సూర్యుడు భూమిచుట్టూ తిరుగుతోందని నమ్మినప్రజ, యిది మాత్రం ఎందుకు నమ్మకూడదు? కాంతి, తిన్నగా, సూటిగా, గీట్లుగా ప్రవహిస్తుందంటారా? సూర్యుడిదగ్గరగా రాగానే, కాంతి కిరణం వొంకరతిరుగుతుంది. స్థలం, లుంగచుట్టుకున్న పాముకిమల్లే వంకర తిరుగుతుంది, ఇక్కడనుంచి బైలుదేరితే, విశ్వంఅంతా చుట్టి ఎప్పటి కైనా యిక్కడికే చేరుకుంటాం. అనుభవించే వ్యక్తినిబట్టి సత్యం

యొక్క స్వరూపం మారుతూంటుంది. ఈరిక్షావాడి అనుభవం యిది. ఇందులోని స్వారస్యం ఐన్‌స్టైన్ వంటి శాస్త్రజ్ఞుల కర్థమవుతుంది.

జనంలో కొంపరు వాడుచెప్పింది రైటన్నారు. పగసాధించడం వాడివుద్దేశమైతే. రిక్షాచక్రం పూడకొట్టుకుంటాడా? లైటు బ్రద్దలు కొట్టుకుంటాడా. గంటలా మోగించే మువ్వలు పోగొట్టుకుంటాడా? అని అడిగారు.

పోలిసుకు, డవాలీ బంట్రోతుకు నమ్మకం కుదరలేదు.

'రిక్షా ఎవరిది?' అని ఎవరో అడిగారు.

'వాడిదేట—సొంతంట' అన్నారు.

రిక్షాకి లైసెన్స్ ఏది? లేదు, పోలీసుకి ధైర్యం చిక్కింది. వూడినచక్రం రిక్షాకి బిగించమన్నారు, వాడు బిగించాడు, ఫ్యాక్టరీ యజమాని బంగళాకి నడవమన్నారు. జనం పల్చపడ్డారు, మెల్లిగా జారుకున్నారు. డవాలి బంట్రోతూ, పోలీసూ ముందు, వెనకనేనూ, మధ్య వూగిసలాడుతూ రిక్షా బంగళాకేసి బైలుదేరాం.

రిక్షాకొని లాభం చెయ్యాలన్న నా సంకల్పం సన్నగిల్లింది. లైసెన్సు యిందాక అంచనా వెయ్యలేదు. దానికి దీపం, గంట, రిపేర్లు చాలా తంతు వుంది. నడిపేవాడికి జబ్బుచేస్తే, మందు యజమాని యిప్పించాలా? ప్రమాదం జరిగితే, నేరస్థుడు లాగిన వాడా? యజమానా? వాడి అపస్మారకానికి యజమాని ఎల్లా బాధ్యుడు? ఇదంతా గంద్రగోళంగా తోచింది.

యజమాని బంగళాకి చేరుకున్నాం. ఆయనా యీలోగా ఆరాలు తీశాడు. ఈ రిక్షావాడు పనిచేసింది, వారి ఫ్యాక్టరీలో కాదట మరో ఫ్యాక్టరీలోనట. అమ్మగారికి ఏవిధమైన ప్రమాదమూ జరగలేదు, వాణ్ణి వొదిలెయ్యండి. అని డవాలి బంట్రోతుకి వుత్తరువు చేశారు. అమ్మగారు పందిట్లో నిలబడి వున్నారు, పో అన్నట్లు సంజ్ఞచేశారు.

పోలీసు 'ఈసారి పోల్లుదగ్గర పెట్టుకుని నడుపుతున్నాడు' అని గర్జనచేసి రిజాని వొక్క కుదుపుకుదిపి చక్కా వెళ్లాడు.

ఆ కుదుపుతో, రిజా చక్రం మళ్లా నూడింది. ఆచక్రం, రెండు ఆకుల నడుమ చిక్కుకున్న ఎర్రపువ్వు కింద పడింది. రిజావాడు ఆ పువ్వుని తీసి, నుటిసు అమ్మగారి దగ్గరకొచ్చి, చేతిని చాచాడు— "ఇందండి" అన్నాడు పుష్పంతీసుకోమని. ఆవిడ కళ్లు సంతోషంతో మెరిసినై, తనకోసం అనుకుని.

"నీ కెంతభయంలేదు పోరా" అంది ఆవిడ, ఆ పువ్వుని తీసుకో బోతు. 'ఆపిల్ల తల్లోకీ నండి" అన్నాడు రిజావాడు. ఆవిడకనుబొమ్మలు చిట్లించింది. దూరంగా అరుగుమీద పనిపిల్ల ఏదో సర్దుతోంది. పరు గెత్తుకుంటూ వెళ్ళి రిజావాడు ఆపువ్వుని అపిల్లకిచ్చాడు.

"భద్రం పూలే పారేసుకున్న దానవు, రేపు మొగుట్టం పెట్టు కుంటా" అని నవ్వి వెనక్కివొచ్చి రిజాచక్రం బిగించుకుంటున్నాడు.

లైసెన్స్ విషయం జ్ఞాపకం వొచ్చింది గావును, పోలీసు మళ్ళా వచ్చాడు. లైసెన్సు డబ్బుకి నేనుహామీ యిచ్చి అతణ్ని పంపివేశాను. రిజా ఎక్కడ ఎక్కమంటాడోనని, చరచరా నడుచుకుంటూ వొచ్చే శాను. నా అభిప్రాయం వొకటి తప్పనిఋజువైంది. ఏదేనా కావొచ్చు గాని, రిజావాడు సామాన్యమానవుడు మాత్రంకాడు.

కథానిక :

# దాగిలి మూతలు

అ్రపంతా అనుకోకుండా అకస్మాత్తుగా జరిగింది. మధ్యాహ్నం నిద్రనుండిలేచి, ఆవులిస్తూ వెళ్ళి గోడనున్న అద్దంలో ముఖం చూసుకున్నాడాయన. నుదుటిమీద సన్నటి గీతలు, నల్లవెంట్రుకల మధ్యలో తెల్లవి, కళ్ళకింద కాకిపాదం ఆకారం గీట్లు—నిజంగా కనబడినంత ముసలితనం, తనలో వుందా అని ఆశ్చర్య పడ్డాడు. ఉపాధ్యాయవృత్తిలో వారు వృద్ధులుగా కనపడతారంటారు. ఆ వుదయమే రామదాసు మాస్టరీ వుద్యోగానికి రాజీనామాయిచ్చాడు. ఇందుకు వో విధంగా సంఘాన్ని మరమ్మత్తు చెయ్యాలన్న ఉబలాటమే కారణం. స్కూలు నిర్వాహకవర్గంవారు, పాఠశాల అభివృద్ధికై పోగుచేయబడ్డ విరాళాలను తమ స్వంతానికి వాడుకుంటున్నారన్న సంగతి బైట పెడతానని బెదిరించాడు. అందుకు సమాధానంగా నాస్తికత్వం, స్వేచ్ఛాప్రేమ బోధించి పిల్లల్ని పాడుచేస్తున్నాడన్న మిషపై యీయన్ని ఉద్యోగంనుండి తొలగించడానికి నిర్వాహకవర్గంవారు సమకట్టారు. ఈతని దగ్గర తన ఫిర్యాదు రుజువుచెయ్యగల బలమైన నిదర్శనా లేవీలేవు. ఇదివరకే తన వింత భావాలపైనా అభిప్రాయాలపైనా వ్యాఖ్యానాలున్నాయి. ఇప్పుడు వెర్రివాడుగా చెప్పుకుంటున్నారు. ఏ కొద్దిమంది విద్యార్థులలో తప్ప తన వాదాన్ని బలపరిచేవారు లేరు. రామదాసుకి రాజీనామా యివ్వక తప్పిందికాదు. అతని వయస్సు నలభైఎనిమిది కావొచ్చు. కాని యింక స్కూలు మాస్టర్ని మాత్రం కాను, అమ్మయ్య అనుకుంటూ అద్దంలో బింబాన్ని వెక్కిరించాడు.

గది మూలనున్న పాత కర్రపెట్టి అద్దంలో కనిపించింది. వెళ్ళి ఆ పెట్టితెరచి అందులో వొస్తువుల్ని పరిశీలించ సాగాడు వివాహమైన కొత్తలో తను కల్యాణికి వ్రాసిన వుత్తరాలు కొన్ని చూశాడు. ఒకదాన్ని తీసి చదివాడు. ఆనాటి తనలోవున్న శృంగార శక్తులు, రసికత్వం ఆశ్చర్యం కలుగజేశాయి. అదంతా వృథా,

కల్యాణిలో ప్రేమోద్రేకం శూన్యం. తన కేమీ పట్టనట్లు, అక్కర్లేనట్లూ యితనివద్దనుంచి ఏదో కొంత దాచినట్లు వుండేది. నిప్పుకణంపై మంచుకణం పడినట్లు యితనిలో వుద్వేగం చప్పబడి మెల్లమెల్లగా అనుమానానికి దారి తీసింది. ఆరుసంవత్సరాల దాంపత్య జీవితం అసూయతో నిండిపోయింది. ఆమెకి సంతానం కలగకపోవడం, యితని చికాకుకి మరో కారణం. అతనిలో లోటు తెలుసుకోవాలంటే మరో పెళ్ళి చేసుకోవాలి. ఇద్దరిభార్యలతో కాపరం మాటలు కాదు. రామదాసు వయస్సు అప్పటికి ముప్పై రెండు. ఆ వీధిలోనే మరో అమ్మాయితో స్నేహం కుదిరింది. ఈ విషయం భార్యతోచెప్పి వేశాడు. ఆమె తగవులాడేది. ఆమెపై అతనికున్న అధికారానికి చిహ్నాలుగా వుంటున్న యీ తగాదాలు అతనికి సంతోషాన్ని కలగజేసేవే అనాలి.

కొద్దినెలల్లో కల్యాణి న్యుమోనియా వ్యాధికి గురైంది. పరామర్శించడానికి వొచ్చిన బంధువుల్నీ స్నేహితుల్నీ చూస్తే రామదాసుకి మండిపొయ్యేది. వాళ్ళల్లో ఎవరో వొకరితో ఆమెకి చెలిమి ఏర్పడి వుండాలి. ఎవరో తెలుసుకోలేక పిచ్చెత్తినట్లుగా వుండేది. కొన్ని రోజుల్లో కల్యాణి చనిపోయింది. మళ్ళా పెళ్ళికి స్వతంత్రుడే కాని. ప్రేమించిన పిల్లకి మరొకరితో వివాహం జరిగి కాపరానికెళ్ళిపోయింది. ఇదంతా జరిగి పదిహేను సంవత్సరాలైంది. అతను మళ్ళా ప్రేమించడం జరగలేదు. వొంటిగా జీవితం గడుపుతూ, విషాదంలో వొక వెర్రి ఆనందాన్ని అనుభవిస్తూంటాడు. అతని వైవాహిక జీవనం భగ్నమయింది గనక వివాహంలో విసుగుతప్ప మరేమీ లేదంటాడు.

మిగతా విషయాలపై అతని అభిప్రాయాలు, అనుభవాన్ని అనుసరించే వున్నాయి. దేశంలో జనాభాన్ని పెంచడమే కాకుండా, సంతానం యాతనంటాడు. పురుషులంతా దగాకోర్లు, స్త్రీలంతా చెడ్డవాళ్లు. ఈ వెర్రివిపరీత పరిణామం పొందకుండా ఉపాధ్యాయ

వృత్తిలో నిమగ్నుడై అంతర్యాన్ని దిగమింగ గలిగాడు. అపనమ్మ కపు సిద్ధాంతాలు అతనిబోధలకి పదునిచ్చాయి.

ఉత్తరాలు పెట్టేసి, రామదాసు ఫొటోగ్రాఫ్‌ల ఆల్బమ్ తీశాడు. అదిఎవరో యిచ్చిన పెండ్లిబహుమానం. పెళ్ళినాటి ఆపటం చూస్తే అతనికి దిగులేస్తుంది. అప్పుడు సన్నగా నాజూకుగా వుండే వాడు, అతనే యితనంటే స్నేహితులు ఆశ్చర్యం ప్రకటించేవారు. గోడనుంటే చూసేవారు యిట్లాంటి వనడం, తనుబాధపడటం జరుగు తుందని, దాన్నిలోపల పెట్టేశాడు. అతను, పదిహేనేళ్ల వయస్సులో తీసుకున్న మరో ఫొటో వుంది. అమాయకంగా కనపడే పెద్దకళ్ళు అవీ - విద్యార్థి దశలో ఫొటో అది. అమాయకత్వంతో వొచ్చే ప్రశాంతత అతని మనస్సులో లేకపోవడం చిత్రంగాతోస్తుంది.తనేదో పాపం చేశానన్న స్ఫురణ పదేపదే అతన్ని ఆవహిస్తుంది. అది చాలా స్వల్పవిషయం. కల్యాణి న్యుమోనియాతో మంచాన పడినప్పుడు, వైద్యుని రప్పించడంలో కాస్తంత ఆలస్యమైంది. జబ్బుఇల్లా పరిణమి స్తుందని ఆతననుకోలేదు. ఆమెకూడా ఫరవాలేదంది. డాక్టరు యీ ప్రస్తావన తేలేదు, ఆమె చనిపోయింది - అందుకతను బాధ్యుడన్న అనుమానం వొదలదు. గిట్టనివారు కొందరు భార్యపోవడం ఏర్పా టుగానే వుందన్నారు. ఈ అనుమానాన్నుండి పారిపోలేడు. ఆల్బమ్ మూసేసి, దానిపై ఏదేనా కప్పుదామని లోపల తడుముతుంటే, నాటకం దుస్తులు బైటపడ్డాయి. చిన్ననాటి నాటకాల సరదాల్ని జ్ఞాపకంచేసే సరంజామ అదంతా. మస్లిన్‌లో కుట్టిన రాజువేషంకోటు, మంత్రివేషం పాగా, మునివేషం కాషాయిజుబ్బా, గడ్డాలు - యివన్నీ మాసి, చినిగి అల్లాగే వుండిపొయ్యాయి. పాఠశాల వార్షికోత్సవం నాడు పిల్లలు నిర్వహించే నాటకాలు అతను చూసేవాడు. అతనూ అప్పుడప్పుడు వోవేషంధరిస్తుండేవాడు - నారదుడు, అతని అభిమాన పాత్ర. రామదాసు తనుగొప్పనటుడై పోవాలనుకునేవాడు. నటు డికి కావల్సిన లక్షణా లతనిలో వున్నాయని నమ్మకం. ఆతనిజీవిత మంతా వొకనటనగా పరిణమించింది. ఆ నటనలో వుత్తీర్ణుడయ్యా

డేమో కాని, రంగస్థలంపై కాలేదు. ఎందుచేతనో. భార్యపోయిం తర్వాత, యోగిగా అవాలనుకునేవాడు. రైల్లో వోమారు 'యోగి' బృందంతో గోష్టిసలిపాడు. పరమాత్మని సందర్శించినప్పుడు కలిగే మహత్తర ఆనందంగురించి, వైరాగ్యంలోనిప్ర శాంతత నిగూఢ్ర్భ, హిమాలయాలలో తపస్సువల్ల పొందే వెలుగునుగూర్చి వారు ప్రస్తా విస్తుంటే, అతను బుద్ధుడు, రామకృష్ణ పరమహంసనీ స్మరించి, వూహించుకున్న సంతోషంలో మునిగేవాడు. రైలునిలబడగానే, టిక్కెట్లులేకుండా ప్రయాణం చేసినందుకు, రైల్వేవుద్యోగి ఆయోగి బృందాన్ని దింపితీసుకుపోవడంతో అతని పగటికల కరిగిపోయింది.

అనుకోకుండానే, రామదాసు ఆ కాషాయవస్త్రాన్ని ధరిం చాడు, మొహానికి గడ్డాలు తగిలించుకున్నాడు. సమాధిలో వున్న ప్పుడు యోగిచేతికింద వుంచుకునే కర్రని తీసుకుని మరోగుడ్డ పాగా చుట్టి, అద్దంలో చూసుకున్నాడు. ఆ దుస్తులు బాగా అమిరాయి. కళ్లలో దీనత్వం, ముడివడిన కనుబొమ్మలు, గంభీరంగా ముడుచు కున్న పెదవులు, తెల్లనెంద్రుకలలోని పరిపక్వత - అన్నివిధాలా యోగిలావున్నాడు.

నిజంగా ఇది ఇతనికి తగ్గవేషం, నిజతత్వంకూడా ఇదే. చటుక్కున రామదాసుకి ఒక ఆలోచన తట్టింది. ఈ దుస్తులతో వీధులోకెళ్లి, సంఘాన్నిచూస్తే ఎల్లా వుంటుందో ... ! అదొక అపూర్వమైన మానసికానుభవం. నిజమన్నట్లుగా గడియారం మూడు కొట్టింది. పనిమనిషితో తనింక ఆపూటకి రానక్కర్లేదని చెప్పాడు. మధ్యగదిలోపల గడియవేసి, దొడ్డివైపు గదికి తాళంవేసి, వీధిలో అటూయిటూ చూసిఎవ్వరూ తనని చూళ్లేదని తేల్చుకుని బైటకి నడిచాడు. నాలుగడుగులు ముందుకేసి ఇంటికేసి, అదే అఖరుసారి చూసినట్లుగా, పరకాయించిచూసి, తొందరగా నడవడం సాగించాడు. పెద్ద రస్తాకి చేరుకున్నాడు. వీధమ్మటనడిచే వ్యక్తులకేసి చూస్తుంటే తనేదో దూరంగా ఎత్తుమీదనుండి చూస్తున్నట్లనిపించింది. పోతుసూ.

మెల్లిగా ఈడ్చుకుంటూ కదిలిపోతున్న దౌర్భాగ్యపు మానవులు వారందరూ - ప్రతి వ్యక్తి మనోవ్యాధి మేఘంలో మరుగుపడ్డాడు. ఇంటికి తొందరగా వెడుతున్న అతను బ్యాంకు గుమాస్తా – ఇల్లు, మరో బ్యాంకు, భార్యకి మంచం అవతలనిలబడి ఈ డబ్బుకాస్తా దాఖలు చేసుకుంటాడు; ఆ కార్లో పై వుద్యోగంకోసం పన్నాగం పన్నుతున్న ప్రభుత్వోద్యోగి కోర్కెలు సిద్ధించినకొద్దీ వారి ఆశ యాలు పెరిగి, చివరకి మేఘం బద్దలై పొందిన ఫలితాల్ని ముంచెత్తి వేస్తుంది.

రామదాసు పార్కు దగ్గిరికి చేరుకున్నాడు. కొందరు పిల్ల లాడుకుంటున్నారు- మరికొందరు వొస్తువులు అమ్ముకుంటున్నారు. ఇద్దరుసాధులు గంజాయి పడుతున్నారు. వారిఎదుట పడకుండా, చెర చెరానడిచి కాలవగట్టుకి చేరుకున్నాడు. గట్టున గుడిసెలున్నాయి, చెట్టునీడని స్త్రీలు బుట్టలల్లుతున్నారు. తొందరగా నడిచి ఏకాంతంగా వున్నచోటుకి చేరుకున్నాడు. ఎవరో అతని వెనక నడుస్తున్నట్లనిపించి తిరిగిచూశాడు. నడివయస్సులోవున్న వొకవ్యక్తి దీనంగా నమస్కరించి పలకరించాడు.

విచారంతో అతని ముఖం వాడినట్లుగావుంది ; బుజానవున్న తువ్వాలుతో కళ్ళల్లో తడిని తుడుచు కుంటున్నాడు. అతన్ని పలక రించాలేమో, రామదాసుకి చటుక్కున తట్టిందికాదు.

"ఎవరు నాయనా నువ్వు - దిగులుగా వున్నట్లున్నావు?"

" అవునుస్వామీ - నన్ను మీ వెంట తీసుకుపొండి."

" ఎక్కడికి?"

"ఎక్కడికైనా సరే మీరు హిమాలయాల్లో వుంటుంటారు."

కొంచెం నిదానించి, రామదాసు "అవును " అన్నాడు.

" మిమ్మల్ని ఏదీకోరను, ఎక్కడికో దూరంగా ప్రశాంతమైన నిర్జన స్థలానికి తీసుకు వెళ్లండి "

" కారణం? "

' నాకు జీవితమంటే విసుగెత్తిపోయింది.... "

రామదాసు కారుణ్యం సూచిస్తూనవ్వాడు.

"జీవితమంటే యింత మోహం మొత్తడానికి నీకు జీవితం గురించి ఏంతెల్సు నాయనా?" అన్నాడు రామదాసు.

" సంసారం త్యజించి, ఇంట్లోంచి లేచిపోవాలనిపించేటంతగా జీవితంగురించి తెల్సు స్వామీ - నేను తిరిగి వెళ్లను. మీతోవచ్చేస్తాను." అన్నాడా వ్యక్తి. అతన్ని శిష్యుడుగా దేశపర్యటన దృశ్యంవూహించి గగుర్పాటు చెందాడు రామదాసు. సరియైన వాక్యంకోసం యోచిస్తుండగా, ఆవ్యక్తి తన కుడిచేతిని పైకెత్తి చూపించాడు.

' హిమాలయాలనుండి వొచ్చిన స్వాములుమీరు - చెయ్యిచూసి నా విషయం చెప్పండి "... అన్నాడు. రామదాసు చకితుడయ్యాడు. చెయ్యిచూసి చెప్పడం రాదంటే? అరచేతిని మృదువుగావొత్తి " నీకు గొప్పభవిష్యత్తువుంది " అన్నాడు. అట్లాగంటే ప్రమాదం లేదు.

" లేదు స్వామీజీ - నాకు భవిష్యత్తు లేదు. దుర్భరమైన గతం మిగిలింది. సర్వమూ త్యజించి నేనుమీతో వొచ్చేస్తాను." అని ఆవ్యక్తి గట్టుమీద దిగాలుపడి కూర్చుని, మొహాన్ని చేతుల్లో దాచుకున్నాడు. పక్కనకూర్చుని బుజాన్ని తట్టుతూ, రామదాసు అతన్ని వోదారుస్తున్నాడు.

" ఏమీ తెలియని పసివాడివి నాయనానువ్వు " అన్నాడు అతను తనవేపు చూడనప్పుడు, మాటలు సులువుగా వోస్తున్నట్లు గ్రహించాడు.

" త్యజించవల్సిన వయస్సు నీకింకాలేదు. ఈ విషయాలను గూర్చి అప్పుడే ఆలోచింపకూడదు. ఇంటికివెళ్ళి, భార్యాపిల్లల్ని చూసుకుంటూ, వారి ప్రేమానురాగాలకుపాత్రుడవై యథోచితంగా సమాజ

సేవచెయ్యి నాయనా. పారిపోవడంవల్ల సృష్టిలయని భంగంచేస్తు న్నావు." అన్నాడు ... నిజంగా పిట్లకేమన్నా అర్థముందా అను కుంటూ. జీవితంగూర్చి వ్యాఖ్యానించి సిద్ధాంతీకరించడంకంటె సుళు వైంది మరోటి లేదనిపించింది. అనేకమార్లు యీ సిద్ధాంతాలను పెద్దలు ప్రస్తావించగా విన్నాడు. ఎన్నోమార్లు పీటినిగురించి చదివి యివన్నీ దగా అనుకునేవాడు.

"అవును నాయనా - యీ చికాకు క్షణికమే. బాధ కాసేప టికి ఉపశమిస్తుంది. ఈ జీవితం వొకరంగస్థలం. ఎప్పుడూ ఎవరో ఒకరు దీనిపైవుంటూనే వుంటారు. నీపాత్ర నువ్వు నిర్వహించాలి. ఎన్నెన్నో ఘనకార్యాలు నువ్వు సాధించాలి. ఎన్నెన్నో కలలుకన్నావు, నీ పిల్లలద్వారా ఆ స్వప్నాలు నిజమవుతాయి. నువ్వు కొంతసాధించి విడిచి పెడతావు. అక్కడ వారందుకుంటారు. సృష్టి నిత్యమూసిద్ధి పొందుతూనే వుంటుంది."

ఆ వ్యక్తి మొహంపైకెత్తి కాలవకేసిచూశాడు. మళ్ళా కిందికి దించి మోకాలుమీద ఆనించాడు.

"లేదు - నాకీజీవితంలో ప్రేమలేదు."

"చెప్పు నాయనా చెప్పు, నిదానంగా చెప్పు."

"తల్చుకుంటే బాధగా వుంటుంది. నేచెప్పలేను స్వామీ..."

"లేదునాయనా ఇతరులతో పంచుకుంటేబాధ ఉపశమిస్తుంది నిన్ను వోదార్చి మనశ్శాంతి గలగచేస్తానేమో యత్నిస్తాను. జీవి తంలో సమాధానం కుదిరేటట్లు చెయ్యగలనేమో - నీ వృత్తాంతం చెప్పవు?"

"మీరు మహానుభావులు. పవిత్రమైన మీ మనస్సుని యీతుచ్ఛ మైన ప్రేమగాథతో కలవరపెట్టలేను. మీ ముందు అల్పుడను కాలేను."

"కాదు నాయనా—అట్లాగనకు. భగవంతుని దృష్టిలో అందరూ సమానులే. పరమాత్మ అన్నిటిలోనూ వున్నాడు. తుచ్ఛమైన ప్రేమలోకూడ—నువ్వు సిగ్గుపడి పోవాలని వుంది." అన్నాడు రామదాసు.

ఆ వ్యక్తి కాలువలో చిన్న చిన్న రాళ్ళు విసురుతూ తన కథ చెప్పడం సాగించాడు. "పెద్దవాళ్ళు ఏర్పాటు చేసిన, సాధారణమైన వివాహం మాది. పిల్లని చూశాను. నచ్చింది. నా వయస్సు ఇరవై నాలుగు, ఆమెకి పదహారు. కార్యమవగానే చదువుకోసం కాలేజీ కెళ్ళిపోయ్యాను. చదువు పూర్తిచేసుకుని ఎనిమిది నెలలకి తిరిగొచ్చాను, ఆమె పాక మొగశిశువును కన్నది. హరి అని నామకరణం చేశారు. నాకు ఉద్యోగం దొరికింది. హాయిగా కాపరం చేస్తున్నాం. ఐదేళ్లతర్వాత మా రాధ పుట్టింది. హరి ఎప్పుడూ తల్లితోనే వుండే వాడు. రాధకి నా దగ్గర చనువు. రాధ అచ్చంగా నా పోలికే అన్నాడు వో స్నేహితుడు. హరికి ఎక్కడా నా పోలికలేదని అప్పుడు గుర్తించాను. అసలు మాకుటుంబంలో ఎవ్వరిఛాయలూ వాడిలోలేవు. వాడు నాకు పుట్టలేదన్న వొక పెద్ద అనుమానం పుట్టింది నాకు. పెండ్లయి పదినెలలేనా కాలేదు. నేను తండ్రినయ్యానన్నారు...."

ఆ వ్యక్తి మౌనం దాల్చాడు.

"ఇంతేనా నెలలవకుండానే ప్రసవించడమనేది వుంది...." అన్నాడు రామదాసు. ఎందుకన్నానా అని పెదవి కొరుక్కున్నాడు, ఆ వ్యక్తి వినిపించుకోనట్లుగా మళ్ళా సాగించాడు.

'కాని పోలికల మాటేమంటారు.? రోజులు గడచినకొద్దీ నా అనుమానం దృఢపడసాగింది. బంధువుల్ని, స్నేహితుల్ని పోలికల కోసం గాలించసాగాను. ఋజువు లేకుండాఆమెపై నిందమోపే సాహసం నాకులేదు. చిత్రం, నా అనుమానంతో పాటు, ఆమె

ప్రేమానురాగాలు ఎక్కువవుతూ వొచ్చాయి. ఇదంతా నన్ను మరి పించడంకోసం చేస్తున్న నటన అనుకునేవాడిని. చూచాయగా ఎత్తి పొడుస్తూ నా అనుమానం బైటపెట్టేవాడిని. రాద్ధాంతాలయ్యేవి. ఇవన్నీ అన్యోన్యానురాగం సూచించేవొట్లతోనూ, ప్రమాణాలతోనూ ముగిసేవి... కాని... కాని"

తడితో కళ్ళు బరువెక్కి అతడు చెప్పలేకపొయ్యాడు. మెల్లగా తేరుకున్నాడు.

" ఈ మధ్యాహ్నం నిజం కనుక్కున్నాను.'' అని నిట్టూర్చాడు.

"విపులంగా చెప్పు నాయనా...."

''నాకింక అనుమానం లేదు- హరి తండ్రీ లక్ష్మీపతి. చిన్నప్పటి నుంచీ మేమిద్దరం స్నేహితులం. ఒక వూళ్ళో కొన్ని సంవత్సరాలు పనిచేశాము. నా పెళ్ళినాటికి, మేమిద్దరం వోవూళ్ళోనే వున్నాము. తరవాత కొన్నాళ్లకి బదిలీ అయి అతను మరోచోటికి వెళ్ళిపొయ్యాడు. ఉత్తరాలు వ్రాస్తూండేవాడు. మొన్న మమ్మల్ని చూసి పోదామనొచ్చాడు.

హరిలో అతని పోలికలున్నాయి. ఉన్న రెండు రోజులూ, ఆ విడకూడా మాతో కలిసి సంభాషించేది. నా కర్థంకాని ఆంతరంగికం వాళ్ళ మధ్య వుండేది. మళ్ళా మాటల్లో నాకేమీ దొరకలేదు. ఒకొరికేసి వొకరూ, యిద్దరూ కలిసి నాకేసీ— చూసే చూపుల్లో నాకేదో కనిపించింది.''

రామదాసు అప్రయత్నంగా నవ్వాడు.

"మనో చాంచల్యానికి, భ్రాంతికీ యిది మంచి ఉదాహరణ— స్నేహితుల్ని యీ విధంగా ఉపయోగించుకుంటున్నావా, నాయనా ?" అన్నాడు.

"అంతేకాదు స్వామీ. ఈ ఉదయం లక్ష్మీపతి వెళ్ళాడు. అతన్ని దిగవిడచి నే ఇంటికొచ్చేసరికి మధ్యాహ్నమైంది. రాధ నిద్రపోతోంది. హరి యింకా స్కూలునుంచి రాలేదు. హాల్లోంచి లోపలికెళ్ళి పడకగది తలుపులు తెరిచాను. ఆమె అదిరి పడింది. తలంటు పోసుకుని, సదో చూస్తూ కూర్చుంది. నన్ను చూసి బెదిరి నట్లు చివాలున లేచి చేతులో వున్న కాగితాన్ని గుప్పెట్లో ముడి చేసి కొంగులో చెయ్యి దాచింది. జుట్టు గాలికి కదులుతూ మెడ చుట్టూ పడింది. శరీరానవున్న తడి చీరని గొద్దిగా పట్టుకుని వుండ డంమూలాన గుప్పెడుకనిపిస్తోంది.

"ఏమిటది ?"....నా ప్రశ్నకి ఆమె వులిక్కిపడింది.

'ఏమీలేదు.'...కంఠంలో దౌర్బన్యం ధ్వనించింది.

'ఏమిటో నాకు తెలుసు' అన్నాను.

'అవుతే నన్నడగటం దేనికి?'

'నే అనుకున్నది సరో కాదో చూద్దామని.'

'ఏమనుకున్నారో ముందు చెప్పండి.'

'చెప్పను.'

'చెప్పకపోతే యిదేమిటో కూడ చెప్పను.'

ఒకడుగు ముందుకేసి... 'ఆగుప్పెట్లో దేమిటో యిల్లాతే' అని గర్జించాను.

'నేనివ్వను' అని రెండడుగులు వెనక్కి వేసింది.

'నేను బలవంతంగా తీసుకోగల్ను తెలుసా'

'అబ్బో...'

'విసిగించక యిల్లాతే - ఊ -' అంటూ దగ్గరకెళ్ళి మోకాలు మీదికి జారిన ఆమె చీరకొంగు పట్టుగున్నాను.

'దూరంగా వుండండి - వెళ్లండి' అని కొంచం విగ్గరగాఅంది

" ఎందు కివ్వవు?"

" మీకి పట్టుదలెందుకు?"

."నాకంతా తెలుసు కాబట్టి..."

" ఏమిటా వెర్రిధోరణి...మీ కేం తెలుసు!"

నా కేం తెలుసో నీకు తెలీకపోతేగా?"

" నా కేం తెలీదు." అన్నదామె.

" మొగుడికి చివ్వర్లోకాని తెలీదంటారు ! " అన్నాను.

" ఆహా " అని కాస్త వెటకారంగా అని హిస్టీరియా అనిపించే అదోరకంనవ్వుని నిలుపుకుంటోంది.

" చివ్వర్లో తెలిస్తే చివర్లోనే నమ్మాలికూడ " ... అని ముగించింది. పూనకంలా వొచ్చేసింది నాకుకోపం. ఆమె నోటిమీద చేత్తో వొక్కటిచరిచాను, చేతులోవున్నదాన్ని లాక్కోడంకోసం. పెనుగులాట సాగించాను. పట్టువొదలక, మంచంబద్దీ పట్టుగుని నన్నొక్కతోపుతోసింది. నేను మంచంపైనకూలాను, వెర్రి ఆవేశంలో కొట్టడానికి ఏదేనాదొరుకుతుందేమో చూస్తూ హాల్లోకెళ్ళి పింగాణీపూలతొట్టిని విసిరేశాను, అప్పుడే వొచ్చి గదిలో కెళ్ళబోతున్న వారికి తగిలింది. అమ్మొయ్యో అనివాడు కూలడం, నే నెళ్లబోతుంటే తలుపులు లోపల గొళ్ళెమెయ్యడం జరిగింది. 'పోఇక్కడికి రాకు పో' అనివాడు గొణగడం అస్పష్టంగా వినిపించింది. కొండ శిఖరంనుండి పడినవాడిలాగైంది—అఘాతంలోకి కుంగిపోతున్నట్లుగా, అల్లా నడుచుకుంటూ యిల్లా చేరుకున్నాను. స్వామీ—మీరే నన్ను చూడాలి."

ఉద్రేకంతో ఆ వ్యక్తి పెదవులు వొణికిపోతున్నాయి. పొరలి వొస్తున్న దుఃఖం మొహాన్ని వికృతంగా చేసింది. రామదాసు అతని మొహాన్ని తుడుస్తూ బుజ్జగించాడు. అతని కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు.

"చూడు నాయనా, 'నేనిది చేశాను,' 'నే నది చేశాను' అంటావు. ఈ "నేను" ఎక్కడుంది? లేదు నాయనా. ఆకలేస్తే అన్నం కావాలంటావు. చక్కలి గింత పెడితే నవ్వుతావు. గిల్లితే ఏడుస్తావు మిగతవాళ్లు ఎవ్వరూ చెయ్యనిది, ప్రత్యేకంగా నువ్వుమాత్రం చేసినది, యిందులో ఏదుంది? అహాంని మరచిపో—కన్నిటికి, నవ్వుకీ అతీతుడ వవుతావు....నీ అహంగురించి ఆలోచించి, దాన్ని ప్రేమించి తుదకు ద్వేషిస్తున్నావు. అందుకనే అహంనుండి పారిపోతున్నావు. నువ్వు నీ భార్యనీ, పిల్లవాడినీ ద్వేషించడం లేదు. నిన్ను నువ్వే ద్వేషించుకుంటున్నావు. హరి గాయపడేటట్లు నువ్వు విసిరిన పూలతొట్టి నీ పైననే విసురుకున్నావు. గాయపడి పరుగెత్తుకొచ్చేశావు"

....ఈ సందర్భంలో ఏదేనా వో శ్లోకం చదవాలనుకున్నాడు రామదాసు, కాని తప్పులు చదవడం అతనికి యిష్టంలేదు.

" నే నామెను ప్రేమించాలనుకున్నాను. శీలం చెడిపోయిన స్త్రీని ప్రేమించలేను స్వామీ...."

రామదాసు చిరునవ్వు నవ్వాడు.

"పిచ్చివాడవు నాయనా .... నువ్వామెను ప్రేమించలేదు, వాంఛించావు. వయస్సు మళ్లడంతో వాంఛ నన్నగిల్లుతుంది. వాంఛ లేనప్పుడు సాధ్యమైన ప్రేమే—నిజమైన ప్రేమ."

"సంతోషం లేనప్పుడు యీ ప్రేమ ఎందుకు స్వామీ....

"ఈమాత్రం తెలీదా? నువ్వు అన్వేషిస్తున్నది ఆనందం కాదు. నువ్వు కోరేది కొత్త కొత్త ఇంద్రియానుభవాలు, వయస్సుతోపాటు శారీరక సుఖాలు పల్చబడతాయి. హృదయం పవిత్రమైన ప్రేమతో నిండుకుంటుంది. సంసారాన్ని త్యజించడానికి నువ్వు సంసిద్ధుడవేగా?

"ఆ...."

"సరే ఇప్పుడు నీ హృదయం లోపల చూడు. అసూయ, ద్వేషం వున్నాయా? "

"అవును స్వామీ—నాకు తెలిసొస్తోంది. మనస్సులో ఆరాటం తగ్గుతోంది."

"నిన్ను గురించి ఆలోచించకు. నీ భార్యను గురించి పిల్లల్ని గురించి ఆలోచించు. వారిని ప్రేమానురాగంతో ముంచివెయ్యి. వారిని సుఖపెట్టు. నువ్వు సుఖపడతావు. ఇదే వేదాలు బోధించే రహస్యం."

"ఇది నాకెల్లా సాధ్యమో చెప్పండి?"

"ఎందుకు కాదు? నీ భార్య గుప్పెట్లో వున్నదేమిటో నువ్వు చూడలేదు. అది మామూలు కాగితం కావొచ్చు, ఏనాడో నువ్వామెకి వ్రాసిన జాబు అవొచ్చు. పాత జాబులు ఎంతో ఆనందాన్నిస్తాయి. ఆ జాబుని ఆమె చదువుతూ వుండొచ్చు"

'అవుతే ఆమె నాకెందుకు చూపించదు?'

"చూడు నాయనా—ఆమెకి నీ లాగే అహంవుంది. నీ అహాన్ని నువ్వు ప్రదర్శించావు. ఆమె తన అహాన్ని బైట పెట్టింది. నీ దౌర్జన్యం, మూర్ఖత్వం, ఆమెలో దౌర్జన్యాన్ని, మూర్ఖత్వాన్ని పురిగొల్పాయి. రహస్యమైన స్వార్థాల సంఘర్షణ అది, తిరిగి ఆమె దగ్గరకు వెళ్లు, నీ మూర్ఖత్వాన్ని తెలియపరిచి, పశ్చాత్తాపపడి, ఆమె క్షమాపణ వేడుకో. ఆమె హృదయ ద్వారాలు తెరుచుకుంటాయి. విశ్వాన్ని సహితం ముంచివేసే ప్రేమ నీపై కురిపిస్తుంది."

"మరొకరికి పుట్టినవాణ్ణి నేనెట్లా ప్రేమించగలను స్వామీ?"

"మనమందరం దేవుడిబిడ్డలం. మరొకరికి పుట్టినాసరే, నువ్వు ఆ బిడ్డని ప్రేమించగలగాలి."

"నేనది చెయ్యలేను."

"నువ్వు చెయ్యగలవు. పరిస్థితులకు లొంగి, ఆమె అజ్ఞానంలో, అపచారంచేసి వుండొచ్చు. ఆమె గతాన్ని క్షమించు. మంచిగా ఉం

ఢేటందుకు వొక్క అవకాశమివ్వు. పుట్టిననాటినుండి, చనిపొయ్యే వరకూ మంచిగావుండే వ్యక్తులు మనలో ఎవ్వరూ లేరు. అజ్ఞానంలో యౌవనచాపల్యంలో, మనం తప్పు టడుగులు వేస్తాం. పొరపాట్లు చేస్తాం - అప్పుడప్పుడు బోర్లగిల పడతాము. లేచి సర్దుకుని, మళ్లా బ్రతుకుసాగిస్తాం. నా కళ్ళల్లోకిచూడు. ఆమె అపచారం చేసిందం టున్నావు. అట్లాంటి అపచారం నువ్వెన్నడూ చెయ్యలేదా -నీలో నువ్వు ఆప్రశ్న వేసుగో..."

" కాని నేను పురుషుణ్ణి..."

" ఆమె స్త్రీ - పైగా మాతృత్వంద్వారా పరిపూర్ణత పొంద వల్సిన భారం ఆమెపైనుంది."

" స్వామిజీ మీరు చెప్పింది నిజమైతే, అసలునీతికే తావులేదు."

" ఇదొక వెర్రి నాయనా. వ్యభిచార మొక్కటేదుర్నీతికాదు. అసత్యం, దగాకోరుతనం, అన్యాయం, లంచగొండితనం, అధికారం, అసూయ, ద్వేషం, పగ, యుద్ధం-ఎన్నెన్నోవున్నాయి యీలోకంలో, ఇదంతాదుర్నీతే. దీనిని నువ్వు ద్వేషించి సమాజంనుండి పారిపోవడం లేదే....సాధించి భాగ్యవంతులైన వారిపట్ల వీటిని ఎందరో హర్షించ డమే కాకుండా ఆదర్శంగా స్తుతించడంలేదా? వెక్కిరింపుగా మృత్యు వులో అంతమొందే యీ క్షణిక జీవితంలో యిదొక అపరాధమా? అనంత విశ్వంలో, ఎడతెగని సృష్టిసమరంలో, ప్రేమలో పరాకుగా కన్ను మూతొక పాపమా! ... నేనొకర్నెరుగుదును..."...

ఏదో చెప్పబోతూ రామదాసు పొరబాటు తెల్సుకుని, చటు క్కున్న నిలిచిపొయ్యాడు.

" చెప్పండి స్వామీ - గొప్ప అనుభవం వున్నవారల్లే మాట్లాడు తున్నారు."

"లేదు నాయనా నాకేమీ అనుభవంలేదు. కాని ప్రేమంటే నాకు తెలుసు - విశ్వమంత గంభీరంగా, సృష్టంత శాశ్వతంగావుండ గలదు."

రామదాసు కళ్లు తడిసి మెరుస్తున్నాయి. నవ్వులోకిదిగిపోయి, ఆ వ్యక్తిని లేవదీసి ముందుకి నడిపిస్తున్నాడు.

"నాతో రా నాయనా...."

"ఎక్కడికి స్వామిజీ?"

"వైద్యునివద్దకి. అతన్ని తీసుకుని నీ ఇంటికివెళ్ళి, పిల్లడిని చూసుకో—

నిశ్శబ్దంగా నడవడం సాగించారు.

"తుమార్పణ, జీవితంతో సమాధానపడటం. ప్రేమ, విశ్వాసం యివి అర్థంలేని ధ్వనులు కావు నాయనా..." అంటున్నాడు రామదాసు. ఇంతలోగట్టునున్న గుడిసెల దగ్గరకి చేరుకున్నారు.

బీదతనం, అనారోగ్యం, ద్వేషం, యుద్ధం - అన్నిటికంటె ముఖ్యంగా ప్రేమరాహిత్యం - యివి నాయనా, జీవితంలో అనర్థాలు. వీటిని తొలగించడమే మానవజీవితంయొక్క పరమార్థం. నీ ప్రేమకోసం తహతహలాడుతున్న నీ భార్యా బిడ్డలదగ్గరికివెళ్లు. వారికి వుపచారం చెయ్యి. అదే పరమాత్మదర్శనం..."

ఇద్దరూ పార్కుదగ్గరకొచ్చారు. ఆ వ్యక్తి నేత్రాలు, ఉత్సాహంతో పదేపదే ముడుచుకుంటున్నాయి.

"మీరు మహానుభావులు స్వామీ - నాకుఅర్థమవుతోంది. నా మనస్సు చల్లగావుంది. ఇంకఅసూయ, ద్వేషమూలేవు...నేను ఇంటికి వెడతాను. వైద్యుని తీసుకెడతాను ... అయ్యో, హరిగాయపడి ఎంతగా ... బాధపడుతున్నాడో. ఆమెపాపం ... ఆమె యెంతగా స్వామీజీ, నేను మీకేమివ్వగలను?"

"నేను చేసిందేమీ లేదు నాయనా. ఇతరుల కోసం జీవించు. దైవం నిన్ను కాపాడుతాడు."

తొందరగా నడుస్తూ ఆవ్యక్తి పార్కు వెనక అదృశ్యుడైపో య్యాడు.

రామదాసు తనలో తాను నవ్వుకున్నాడు. జరిగిందంతా హాస్యాస్పదంగా తోచింది. వేదాంతం పేలాకోళమనీ, మనిషి పగాకోరనీ అనుకునేవాడు. ఆధ్యాత్మిక చింతనపైనా, దైవంపైనా అతని కెప్పుడూ గురికుదరలేదు. విశ్వాసంలేని అతనిపలుకులనుండి వోదార్పుపొంది, అతని మాటలు నమ్మి జీవితవిధానం మార్చివేసుకోటానికి సంసిద్ధుడైన వోక వ్యక్తి అతనికి తటస్థపడ్డాడు. మానవులు ఎంతటి అమాయకులు!.... గొప్పగా ధ్వనించే మాటలకీ, శూన్యమైన భావాలకీ లొంగి, మోసపోతారు......తన భాషకి, భావానికీ తనే ఉద్రేకపూరితుడై, హృదయంలో సంచలనం కలగడం గుర్తించి రామదాసు చీకాకుపడ్డాడు. నుదుటిమీద చెమట్లు కమ్ముతున్నాయి. పాగా తీసేసి, వోకపొరతీసి దానితో మొహం తుడుచుకున్నాడు. సూర్యుడు దిగిపోతున్నాడు. పొడుగాటి నీడలు పడుతున్నాయి. చెట్లు, వీధి, పడమటిఆకాశం - వీటిపైన సంధ్య వెలుగు ఎర్రశాలువా కప్పినట్లుంది. ఇద్దరు సాధువులు సంచీలు కట్టేసుకుని, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కాలవకేసి నడిచిపోతున్నారు. వారిలో వొకడు వెనక్కి తిరిగి తనకేసి చూసినట్లయింది. రామదాసు వెంటనే పాగాతగిలించి, పార్కు అవతలవైపుకు వెళ్ళాడు. కుళాయిదగ్గర మొహం కడుక్కొని కాసిని నీళ్లు తాగి ముష్టివాళ్లమధ్యగా నడిచి పార్కుకి లోపలికి చేరుకున్నాడు. అలసటగా వుండి, కాసేపు సేద తీర్చుకుందామనుకుని, వో మూల కర్ర బెంచీమీద మోకాళ్ళు ముడుచుకుని కళ్లు మూసుకుని కూర్చున్నాడు. కొన్ని నిమిషాలు గడిచాయి. ప్రతిధ్వనించే పిల్లల కేకలూ, నవ్వులూ వినబడ్డాయి.

పిల్లలతో ప్రమేయం, మరోచోటుకి దూరంగా వెడితే మంచిదేమో అనుకున్నాడు. కాని వాళ్లు ఆటల్లో లీనమైపోయ్యారు. తనని గమనించినట్లు లేదు. వారి వొయ్యారమైన పరుగులు, ముద్దుగొలిపే నవ్వులు, చూడ్డానికి ఆకర్షణీయంగా వున్నాయి వారి సహజమైన సంతోషం. అతన్ని సంతోషపెట్టింది—చూస్తూ కూర్చున్నాడు. ఆకాశంలో ఎరుపు కరిగి, దట్టమైన ఊదారంగు మేఘాలు కమ్ముకుంటున్నాయి. ఫ్యాక్టరీ కూత వినబడింది. పావురాలు చెట్లమీదికి ఎగురుతున్నాయి.

అతను లెక్క పెట్టాడు. ఆరుగురుపిల్లలు దాగిలిమూత లాడుకుంటున్నారు. ఐదారేళ్లుంటాయి—ఆ పిల్ల,దొంగ;కళ్లమీద రుమాలు కట్టివుంది. మిగతా ఐదుగురూ దొరకకుండా అటూ యిటూ పరుగెడుతూ, మొక్కలవెనక, బెంచీలకింద దాక్కుంటున్నారు. ఆపిల్ల చేతులు చాచి, తడుముళ్లాడుతూ తిరుగుతోంది. రామదాసుకి దగ్గరగా వొచ్చింది, అతను లేవబోతుండగానే అతని భుజం పట్టుగుంది. "ఇదుగో దొంగ...దొరికాడు...అమ్మదొంగా—ఇక్కడున్నావా?" అని కేకలేస్తూ, మొహానవున్న రుమాలు లాగేసింది. మిగతా వాళ్ళందరూ నవ్వుకుంటూ ఆమెచుట్టూ మూగారు. "ఇదుగో దొంగ"... అన్నది ఆపిల్ల. మిగతా వాళ్ళందరూ, రామదాసుని అటూ యిటూ లాగుతున్నారు. అతని గడ్డాలు వూడి వొచ్చేస్తాయేమో నని భయపడ్డాడు, నిలబడి సర్దుకున్నాడు. ఆపిల్ల సిగ్గుపడి, ముసిముసిగా నవ్వుకుంటూ పరుగెత్తుకుపోయింది. మిగతావాళ్ళు ఆమె వెనకే పరుగులు సాగించారు.

రామదాసు పార్కు గేటు ముందుకి చేరుకున్నాడు. దూరంగా వో జట్కాబండి నిలిచింది. అందులోంచి, ఇందాకా ఇంటి కెళ్ళిన వ్యక్తి, వో కుర్రాడు దిగి. తనవైపుకి నడచి వొస్తున్నారు.

స్వాప్నికుడికీ ఏం రిక్కమంటారనుకున్నాడు. అదుగో నా భార్య. రాధ; అదుగో ఆ బండిలో వున్నారు. పార్కు కేసి షికారుగా

బైలుదేరాము. మీరుంటారనుకున్నాము. ఆమెకి మీ దర్శనం చేసుకుని, ఆశీర్వాదం పొందాలనుంది. మీరు సారీ. చిన్నగాయమే తెండి తగిలింది. వైద్యుడు బాండేజి వేశాడు. స్వామీ. మీరుచెప్పినట్లే జరిగింది స్వామీండి! అంతా....ఎలాగొచ్చి, చదువుతున్నది వుత్తరం కాదు. నే వెళ్ళేటప్పుడికి మా పెళ్ళినాటి ఫోటో చూసుకుని, జ్ఞాపకాలని పూహించుకుంటోందిట. నే పరాయివాడిగా ఆ జగత్తులో ప్రవేశించానట.... నేను మూర్ఖుణ్ని స్వామీజీ....ఆమెతో అంతా చెప్పేసి క్షమాపణ చేసుకొన్నాను. మీరు మహానుభావులు. క్షణం ఉండండి. వాళ్ళని తీసుకొస్తాను...." అంటూ సమాధానం చెప్పనీకుండా,అతను గబగబ బండిదగ్గరకు వెళ్ళాడు. అతని భార్య, కూతురు బండిదిగడం చూశాడు రామదాసు. మెల్లగా నడుచుకుంటూ వొస్తున్నారు. వారికేసి చూసి, చివాలున వెనక్కి తిరిగి రామదాసు నడవడం సాగించాడు. వాళ్ళు వొచ్చేసరికి అతను అక్కడ లేడు. వారిని అక్కడ దిగవిడిచి, ఆ వ్యక్తి పిలుస్తూ వెనకాలే నడచి వెళ్ళాడు.

"స్వామీజీ— వెళ్ళిపోతున్నారా.... వాళ్ళని ఆశీర్వదించరూ?"

రామదాసు అతని కళ్ళల్లోకి చూశాడు.

"పరమాత్మ మిమ్మల్ని ఆశీర్వదిస్తాడు. నేను వెళ్ళాలి."

"ఎక్కడికి స్వామీ?"

"ఇంటికి...."

"ఇంటికా? మీకు ఇల్లు లేదన్నారుగా...."

"అవును నాయనా దేవుడే నాయిల్లు." అని రామదాసు తొందరగా నడిచాడు. పెద్ద రస్తాకి చేరుకున్నాడు. వెనక్కి తిరిగి చూశాడు, ఆ వ్యక్తి పార్కులోకి వెళ్ళడం చూశాడు, హరిని చూడగానే అతనే'దొంగ'ని రామదాసుకి తెలిసిపోయింది. పదిహేనేళ్ల విద్యార్థిగా వున్నప్పటి తన ఫోటో ఆ మధ్యాహ్నమే చూశాడు.

హరి ఆ ఫొటోలో పిల్లాడిలా వున్నాడు. 'దొంగ నౌకరీకాడు' అన్న పార్కులో పిల్ల మాటలు అతని చెవులో గింగురుమంటున్నాయి. ఆపిల్లల నవ్వు పిలుపులు ముసుసుగున్న అతని హృదయం పైన గుద్ది నట్లుగా వుంది. తలుపులు తెరుచుకున్నాయి- వేదాంతం అంతా వేళాకోళం, మనిషి దగాకోరు అనుకునే వాడుగా......తను దగా కోరు; తన జీవితం వేళాకోళం; కళ్యాణిని ప్రేమించి క్షమించ మన గలిగాడా తను? స్కూలు వ్యవహారాలు బైటపెడతా నన్నాడు, నిర్వాహక వర్గం వారిపై ద్వేషం వల్ల కాదా? ఎవరిపై అతనికి నమ్మకం వుంది? తనమీద తనకి నమ్మకం వుందా? కళ్యాణి జబ్బుతో మంచాన పడినప్పుడు, వైద్యుని ఎందులకు వెంటనే పిలవలేదు? చని పోతే, తన బిడ్డని దాల్చిన ఆమెని పెండ్లి చేసుకుందామనేగా?

రామదాసు, తన యిల్లు వున్న వీధికి చేరుకున్నాడు. అడుగు నీర్సంగా పడుతోంది, అస్థిపంజరం వొణుకుతోంది. కళ్ళమ్మట కన్నీరు కారుతోంది. ఆకాశంలో చందమామమీద సన్నటి పొరలా తెల్లటి మేఘం పడింది. నక్షత్రాల కేసి చూశాడు. చందమామ మీది మేఘం తొలిగింది. అతని మనస్సులో ఏదో తేటగా మెరిసినట్లయింది. వీధిలో జనం లేరు—మేడల కిటికీల్లోంచి, దీపాలు కదులుతు న్నాయి. ఇంటికి చేరుకున్నాడు. అదిగో అతని ఇల్లు—ఇన్నాళ్ళూ తను దాక్కున్న ఇల్లు. తనెప్పుడూ దాక్కుంటున్నాడు —ఇంట్లోనో స్కూల్లోనో గడ్డాల వెనకనో; ఇప్పుడు దొరికిపొయ్యాడు. ఇంక దాక్కో లేడు.

ఆకస్మికంగా రామదాసు వెనక్కి తిరిగి నడచి వీధి మొగిలో కొచ్చాడు. పెద్ద రస్తాలో తొందరగా నడిచిపోతున్నాడు. పార్కు దాటి, గుడిసెలు దాటి, కాలవ గట్టమ్మటే వెడుతున్నాడు, మొహాన తగిల్చిన గడ్డాలు పీకి, కాలవలో పారేశాడు. ఇంకా నడుస్తున్నాడు. ఇంకా దూరంగా మంచుతో, మసగగా కప్పబడిన ఆ పచ్చకొండ వేపుకి, దానవతలున్న వింత కేసి కదిలిపొయ్యాడు.

కథానిక:

# పశ్చాత్తాపం లేదు

కమలమ్మ నన్ను మళ్లీ రెండు చీరలు కొని తీసుకురమ్మంది. క్రితం సారి కొన్న చీరలు తన స్నేహితులు ఎంతో బాగున్నాయన్నారట. ఎవళ్లు ఏ చీరలు ధరిస్తే బాగుంటారో నాకు బాగా తెల్సునంటుంది. చీరల నాజూకు, నాణ్యం, మన్నిక, బోర్డర్ల అమరిక నాకు తెలిసినంతగా మావాళ్ళల్లో ఎవ్వరికి తెలియవుట. నిజానికి నాకు వాటివిషయం అంతగా తెలీదు. ఈకాస్తలో అతిశయం ఎందుకు? నాకు బొత్తిగా తెలియవని వొప్పేసుగుంటున్నాను. భారతంలో ధర్మరాజు ఏదో సందర్భంలో ధర్మమూర్తిగా పేరు పడ్డాడు — ఆ పేరు నిలబెట్టుకునేందుకు చాలా బాధపడినట్లుగా కనిపిస్తాడు. ఇతరులు మనల్ని పూర్తిగా అర్థం చేసుకోక పోవడంవల్ల కొన్ని బాధలు పడతాం. పూర్తిగా అర్థం చేసుకున్నట్లయితే యింకెంతటి చిక్కుల్లో పడతామో! కొందర్ని గురించి కొన్ని అభిప్రాయాలు స్థిరపడతాయి. వాటికి అనుగుణంగా ప్రవర్తించడానికి వారు చాలా యత్నాలు చేసి ఆ అభిప్రాయం తప్పుకాదని ఋజువు చేసేందుకు నటించడం మొదలు పెడతారనుకుంటాను—

కమలమ్మ నాకు చీరల విషయం బాగా తెలుసునన్నప్పట్నుంచి నేను చీరలకొట్లచుట్టూ తిరగడం తప్పిందికాదు. మహా కొనేవాడిలాగ లోపలికి వెళ్ళడం - రకరకాల చీరలు తీయించి చూడడం, ఏవి ఎవరికి బాగుంటాయో ఊహించుకోవడం - వాటి ధరలు, అవిఎక్కడెక్కడ తయారయ్యేదీ, తెలుసుకోవడం పరిపాటి అయిపోయింది. అవ్వాళ్లో నాపని చూసుకొని కమలమ్మ చీరలకోసం కొట్లో ప్రవేశించేటప్పటికి సాయంత్రం నాలుగైంది. కొట్టువాడు రకరకాల చీరలను నా ముందు పరిచి వర్ణించడం మొదలు పెట్టాడు. ఓ పావుగంట పరామర్శించినా ఏ చీరలు బాగున్నాయో నేను నిర్ణయించలేకపోయాను.

అన్నీ బాగానేవున్నై. ఎక్కువ ధరున్న చీర మరీ బాగున్నట్టు కనిపిస్తుంది - అదేం చిత్రమో! వాటిని చూసినప్పుడు మన దేశంలో ఎంత గొప్ప పనివాళ్ళు వున్నారో వూహించడం - వెనక యింకా ఎంత గొప్ప పనివాళ్ళు వుండేవాళ్ళో. అగ్గిపెట్టెలోంచి చీరని విప్పి కట్టుకొన్న ముంతాజ్ బేగం, ఝాన్సీ లక్ష్మీబాయి, యింకా వెనక్కి వెళ్ళి.గార్గి, మండోదరి, దమయంతి, చీరల ప్రస్తావన వొచ్చినప్పుడు అందరికంటె ముఖ్యంగా స్మరణకొచ్చే ద్రౌపదీ మొదలగు సౌందర్య మూర్తులను వూహించుకోవడంలో ఆనందం వుంది. చీరల డిజైన్సను బట్టి, అద్దకం అసరికను బట్టి వాటిని మొదట్లో సృష్టించిన పనివాడిని వూహించడం మరీ తమాషాగా వున్నా, అమ్మేవాడు 'యిదేమన్నా కొనే బాపతేనా' అన్నట్లు విసుగుతో కనుబొమ్మలు చిట్లించగానే మాఅమ్మమ్మ తయారుచేసిన బొంతలో గుడ్డ పేలికల మాదిరి వూహా దృశ్యం తుత్తునియలై పోతుంది. అంతపనీ జరిగింది. కొట్టువాడికి విసుగుపుట్టి మరోవ్యక్తికి చూపించటానికి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. ముంతాజ్ బేగం,ఝాన్సీ లక్ష్మీబాయి, గార్గి, మండోదరి, దమయంతి, ద్రౌపదులు,'అది' 'ఇది' 'ఇదికాదది'అని వారభిరుచులను బట్టి చీరలను ఎన్నుకోవలసిందిగా చెపుతూనే వున్నారు. వాళ్ళకేం వాళ్ళు ఎన్నైనాచెప్తారు. వాళ్ళందరిది బంగారు ఛాయ. వాళ్ళు ఏ చీరధరించినా బాగానేవుంటారు. కమలమ్మది నల్లటి ఛాయ. అట్లాగంటే కోపంవస్తుంది,కాబట్టి చామనఛాయ అంటాను.అంచేత డాబుగా కొట్టొచ్చేటట్లు కనబడే దట్టమైన రంగుల చీరలను తోసేసి కొంచెం లేత రంగులవి బైటకి లాగాను. అటు, యిటూ చూశాను. ఎందరో మొగాళ్ళు, ఆడాళ్ళు కనుపించారు. ఆ గుంపులో అమ్మేవాడెవడో తెలియక అటూయిటూ చూసి తలవంకించి రమ్మన్నట్లుగా సంజ్ఞచేసి మళ్ళా ఆ చీరల దొంతరలోంచి ఒక చీర పైకి లాగి 'యిది బాగుందా?' అన్నాను, అప్రయత్నంగా పక్కనున్న వ్యక్తికేసి చూడకుండా.

" బాసికం లేని ఆ సిమెంటు రంగుది బాగుంది. " అంది ఆవ్యక్తి తాలూకుకంఠం. ఆశ్చర్యపడి తిరిగి చూసేటప్పటికి ఆవ్యక్తి వొక స్త్రీ. క్షమించమండామని లోపల అనుకున్నా. కాని, నాకంటె చిన్న వ్యక్తిని క్షమించమనడానికి మనసు వొప్పుకోలేదు. ఆమె ఇరవై ఏండ్ల లోపుదిగా కనబడింది.

" లేకపోతే ఆ స్నఫ్ కలర్ ది కూడా బాగుంది." అందిఆమె మళ్లా. ఆవిడ ఎన్నిక చీరని పాటిలెయ్యడం కష్టం తోచింది. ఎందుకంటే కమలమ్మకి, స్నఫ్, సిమెంట్ కలర్లు బాగుండవు.

" ఇవి, కొంచం నల్లవాళ్ళకి బాగుంటా యంటారా?" అన్నాను.

" నా క ం టె నలుపా?" అంది. ఆమెనలుపుకాదు, బాగా ఎరుపులో జత.

" అబ్బే - మీ కేం? - మీరు" ఎట్లాచెప్పాలో తెలీలేదు. నవ్వింది.

" చాలా నలుపు" అన్నా. నాకు నవ్వొచ్చింది.

" ఎవరికి యీ చీరలు?" అంది.

" కమలమ్మని — మా చుట్టం "...అన్నా.

ఆడమనిషి ఎంతసేపు బేరంచేసినా కొట్టువాడికి విసుగుండదు కాబోలు చక్కావొచ్చాడు. ఆమె చనువుగా మాట్లాడడం కొంచం ధైర్యం కలిగించింది.

"మీరు కట్టుకున్న చీర చాలా బాగుంది."అన్నా. అట్లాఅంటే స్త్రీలు తృప్తిపడతారని తెలుసు నాకు.

" ఇదా..." అని చీరకేసి చూసుకుంది.

" ఇది పట్నంలో కొనుక్కున్నా. పాతదైంది"

" అల్లాంటివి యిక్కడ లేవనుకుంటా ..." అంటూ ఏదో గొణిగాను.

త్రొందరగా తనకి కావాల్సిన చీరలు రెండు ఏరేసి బిల్లు తెమ్మంది.

"నాకు తెలడంలేదు. మీరు తేల్చండి మీ కిల్లాంటివి బాగా తెలిసినట్టుగా తోస్తోంది" అన్నా. ఆమె గర్వంగా నవ్వింది.

"పోనీ. ఆ కమలమ్మనే కొట్లోకి తీసుకురాలేక పోయ్యారా!" అంది.

"కమలమ్మది యీవూరు కాదు."

"మీది?"

"నాదీ కాదు..."

ఆఖరికి రెండుచీరలు, ఆవిడ ఏరిపెట్టింది. కమలమ్మకి కోప మొచ్చినా సరే ననుకుని, సిమెంట్ రంగుదికూడా ఏరాను. ఆమె మరింత గర్వంగా తన సమ్మతిని తెలియచేస్తూ, తల పంకించింది. చిల్లర తెచ్చేలోపల నేను అప్రయత్నంగా ఆమె కేసి చూడడం మొద లెట్టాను. అసలు నాకు స్త్రీలంటే చెడ్డసిగ్గు. అందులో పరాయిదంటే భయంకూడా.

కాని, ఆమెలో అమాయకత్వాన్నుండి జనించిన చనువు, "నాతో స్వేచ్ఛగా మాట్లాడొచ్చు" అని ఆహ్వానిస్తున్నట్లు కనపడే చురుకుతనం. విచక్షణచేసి విలువలు కట్టడానికి యింకా అలవాటు పడని యవ్వనం తాలూకు దగ్గరతనం—ఈరకం ఆకర్షణ ఆమెలో వుండడం మూలాన్న కాబోలు తబ్బిబ్బునుండి తేరుకొని సాఫీగా మాట్లాడ గల్గుతున్నాను. మాట్లాడిన కొస్సేపు యీమె చక్కనిదేనా అన్నప్రశ్న రాలేదు.

'జాకెట్టుగుడ్డలు చూడరూ?' అంది.

నాకు నవ్వొచ్చింది. ఆమె మెడకేసి చూశాను. రెండుమూడు గొలుసులు కనిపించాయి. ఎర్రరంగు చీరకొంగు మెడచుట్టూ లాగి కండువాలాగ వెనక్కి వేసుకుంది.

"మీ కిందులో ఏది బాగుంది?" అంది మరికొన్ని బట్టలు చూపించి.

జనం పల్చబడ్డారు.

అరగంట కొట్టింది కొట్లో గడియారం. నేను చీరలసంచి తీసుకుని, గుమ్మంలోకి రాగానే, చాలా సేపునుంచి కురవడం మొదలెట్టిన వర్షం పెద్దదైంది. ఆమెకూడా వొచ్చింది.

"వర్షంలో ఎట్లా వెళ్ళడం?"

నేనూ, అదే అనుకొంటున్నా. కొట్టువాడు సిద్ధంచేసిన కుర్చీ మీద కూర్చుంది.

"మరి మీకో !" అంది.

"ఫరవాలేదు" అన్నా.

"మీరేం చేస్తున్నారు?"

"నేనేమీ చెయ్యను. అప్పుడప్పుడు కథలు వ్రాస్తుంటాను."

ఆశ్చర్యంతో "నిజంగా ?" అంది కాని, అల్లాచెప్పినందుకు విచారించా. కథలనుగురించి కొత్తవాళ్ళతో. అందులో స్త్రీలతో విమర్శించడం నాకు విసుగు.

"నేనెప్పుడూ మీపేరు వినలేదే! అంటే, అసలు నేనెప్పుడూ చదవనులెండి...స్కూలు కథలు పాఠాలతోనే సరిపోతుంది"

బతికారా దేముడా అనుకున్నా.

"కథలంటే నవల్సా ?"

"బాగా పెద్ద కథ అయితే నవలంటారు"

నన్నుగురించి చాలా అడిగింది. తననిగురించి చాలా చెప్పింది. మా యిద్దరిలోనూ ఏమీ సమానంగా లేవు. మా తండ్రి వృత్తివేరు.

ఆమెకి తలితండ్రులు గతించారుట. అన్నగారు ప్లీడరుట. అన్నదగ్గిరే వుంటోందట. వాళ్ళ తల్లినిగురించి చాలాసేపు చెప్పింది. సంభాషణ యింకా వ్యర్థంగా కనబడకుండానే వాన వెలిసింది. ఆమెలేచింది. నేనూ కదిలాను. అప్పుడో ప్రమాదకరమైన ప్రశ్న వేసింది.

'మీకు పెండ్లయిందా!''

"లేదు...'' రోడ్డుమీదికి చేరుకున్నాం.

పైట చల్లగావుంది. పశుల అరుపులో చలివల్ల వొణుకుతున్న వంకర్లు వినిపిస్తున్నాయి.

"మీకు ?" అన్నా మెల్లిగా.

నాకు కాఫీ తాగాలనివుంది. అట్లా అనిచెప్పా. తనూ తాగుతానంది. నాకు మొదట్లో భయంతోచినా, చీకటివల్ల కొంత ధైర్యంచిక్కింది. మమ్మల్ని ఎవరుచూసినా ఫరవాలేదని. పైగా నాది పొరుగూరు.

హోటల్లో మూలగదిలో చేరుకున్నాం.

"మీ విషయం చెప్పారుకాదు" అన్నా ఇందాకటిప్రశ్నని రెట్టించి.

"లేదు, లేదు" అని తన భుజాలకేసి సిగ్గువల్లకాబోలు చూచుకొని నవ్వింది. నేను ఆమెతో మాట్లాడుతున్నా నా మనస్సు అక్కడ లేదు; ఎందులోనూ అంగీకరించని మేము వివాహం విషయంలో ఒకటయ్యాం. మా యిద్దరికీ పెండ్లిండ్లు కాలేదు. అదేగాలిలో చూరంగా కనిపించే మా స్నేహాభవనానికి పునాది.

తర్వాత యిద్దరం మౌనంలో పడ్డాం. యింక మాట్లాడేందుకు ఏమీ కనిపించలేదు.

" ఏవన్నా తీసుకుంటారా?''

" తీసుకున్నాంగా "

" ఏంతీసున్నాం?"

" చీరలు కదూ! "

" అబ్బే అదికాదు. ఏమన్నా పుచ్చుకుంటారా," అని.

" ఓ. అదా. వద్దు వద్దు నవ్వింది. అందమైన పళ్ళవరుస. ఎప్పుడూ నవ్వుతోవుంటుంది. టూత్‌– పేస్టు ఎడ్వర్టైజ్ మెంటుకి జరిగే పోటీకి ఆమె నవ్వుతున్న ఫొటో పంపాలనుంటుంది.

' మరి మీరో?'

' నేనేమిటి? '

' ఏం పుచ్చుకోరు? '

' ఓ అదా. ' అని నవ్వుతూ జేబురుమాలు నాపళ్ళ కడ్డంగా పెట్టుకున్నాను. పళ్ల వరసలోంచి ఒకపన్ను కాస్త వెనక్కి వుంటుంది నాద, అందుకని మళ్ళానిశబ్దం. క్లీనర్ కప్పులు, ప్లేట్లులాక్కు పోతున్న ధ్వనులు. వాడు నల్లగా వున్నాడు. తలకేదో ఎర్రటిగుడ్డ. అజంతా చీకటిగుహలో గోడమీద చిత్రంలో రాజుగారికాళ్ళకు, పీటగా వెన్నువంచి కూర్చున్న ఆకుర్రాడి చిత్రంలా.

నేనే బిల్లుచెల్లించా - బయటికినడిచాం. నడుస్తూ వెడుతున్నాం. అక్కడితో రోడ్డు రెండు పాయలగా చీలింది.

"మీరు లేకపోతే చీరల సెలక్షన్ యింత తొందరలో యింత తృప్తికరంగా అవకపోను" అన్నాను, ఏదో మాట్లాడాలికదా అని.

"నన్ను అండి ఎందుకంటారు - మీకంటె చిన్నదాన్నికదూ. అనకండి" అన్నదామె.

ఈచిన్నా, పెద్దా పట్టింపులు నలభై యేళ్ళపడిలో పడిన వాళ్ళకిగాని ఆమె కెందుకు. ఏళ్ళపట్టింపు పెట్టుకున్న వాళ్ళు, తమ పట్టింపు ముదిరినకొద్దీ యవ్వనానికి దూరమై పోతున్నారన్నమాటే!

పేరు చెప్పింది, 'కమల' అని.

"మా కమలమ్మదీ. మీదీ - కాదు కాదు - నాది - ఒకటేపేరే. చిత్రంగా లేదూ !" అన్నాను.

నాది ఫలానావూరు అని చెప్పాను.

"మాది మీవూరికి దగ్గరే" అంది. యిక్కడ కాలేజీలో చదువుకుంటోందిట సెలవులిచ్చారుట. వూరికెళ్ళముందు, ఏమైనా చీరలు కొనుక్కెడదామని తనని ఫలానా కొట్లో వుండమని తను కూడా వస్తానన్న స్నేహితురాలు ఎందువల్లనో రాలేదుట.

ఆమెకో తమ్ముడున్నాడుట. పట్నంలో కాలేజీలో చదువు కుంటున్నాడట. తనిక్కడా తమ్ముడక్కడ. విడివిడిగావుండి ఎందుకు చదువుకోడం అని అడగాలనిపించింది. కాని అవన్నీ నాకెందుకూ. ఎందుకూ అనుకుంటే అడగాలని ఎందుకనిపించింది? ఏమిటో నాకంతా గందరగోళంగా వుంది.

తనింటికి రమ్మనమంటుందేమోననుకున్నా. కాని, అల్లా అన లేదు.

"మీ వూళ్ళో మీయిల్లు ఎక్కడ ?"

మాఇల్లు ఎక్కడుండేది. ఎల్లావుండేదీ అంతా చెప్పాను.

"సరే. నే వెడతా...." అన్నాను. నాకేసి చిత్రంగా, జాలిగా చూసింది. తన హృదయంలో బాధా, కంఠంలో భాషా దిగమింగు కుని.

'కమలమ్మని అడిగానని చెప్పండి....'అని కదిలివెళ్ళిపోయింది.

నేనక్కడే నిలబడిపొయ్యాను ఆమెకేసి చూస్తూ. మధ్యలో రెండుమార్లు నావేపు తిరిగి చూసింది

జడ చీరలో కలిసి, రెంపూ చీకట్లోకలిసి, మెరిసి మెరిసి అంత ర్థానమైంది. అనుకోకుండా నానేత్రాలు తడిసినై. నాకు దిగులేసింది.

నాగొంతువ అర్థంకాక నరాలు దోవతప్పి తిరుగాడుతున్నాయి. నేనో అబద్ధం చెప్పాను, నాకు పెండ్లికాలేదని. ఆ ఏమీతెలీని అమాయకు రాలితో యీ అసత్యం చెప్పడంలో నావుద్దేశం నాకర్థంకాలేదు. మిగతా అన్ని విషయాలు నిజంచెప్పాను. ఎందుకు? సమయానికి నా తార్కిక జ్ఞానం, నాబుద్ధి, నోరుమూసుకుంది. నన్ను సంప్రతించ కుండానే, నా పంచేంద్రియాలు ఏకమై ఆ అబద్ధం నాచేత చెప్పిం చాయి, అంతే భాషయొక్క విలువ! నాకు నా భావాలమీద, శరీ రానికున్నంత అధికారం లేదన్నమాట : చిన్న బుచ్చుకున్నాను; నామీద నాకు కోపంవచ్చింది. అట్లా పెళ్ళి కాలేదంటే, ఆమె అసూయలేకుండా, నాతో స్వేచ్ఛగా మాట్లాడుతుందనా? నిజంచెప్పి ఆమెని వంచించలేననా? ఆమె నన్ను నిజంగాకోరి ప్రేమిస్తోందను కుంటే, నాకు భార్య వుంటేమాత్రం ప్రేమించడం మానుతుందా? మరెందుకు అబద్ధం?

లేక సంసారానికి, నేబానిసనని వొప్పుగోటానికి నాలో వ్యక్తి త్వం యిష్టపడక, తిరగబడి అసత్యం చెప్పించి వుండొచ్చు. బ్రహ్మ చారి స్వేచ్ఛని అనుభవిస్తున్నాడనుకుంటాడు. స్త్రీకి, అతనిలో కొత్త దనం, లోతు, ఎవరూ పొందని స్వచ్ఛమైన ప్రేమ వుంటాయని అతని అభిప్రాయం. పెండ్లికాగానే ఆ కొత్తదనం నశించి, స్వేచ్ఛ పోగొట్టు కోగానే, స్త్రీప్రపంచంతో అతని స్నేహబంధనాలు నశించాయన్న వొక, వెర్రి నమ్మకాన్ని పరిహసించడానికా నాఅబద్ధం? పెండ్లయి ఏడాదే అయిందనుకోండి. ఏడాదైనా, ఏడు ఘడియలైనా, భార్య వున్నవాడు లేనివాడికింద ఎట్లా లెక్కింపబడతాడు?

అట్లా అబద్ధం చెప్పితే ఆ స్త్రీ సంతోషించి తనతో మరింత స్వేచ్ఛగా మాట్లాడనిస్తుందని భావం కాబోలు!

పైగా, మాజీవితాలలో, మేము ఎన్నడూ కలుసుకోంగదా అన్న ధైర్యం వొకటి. ఆకాసేపు అబద్ధంచెప్పి ఆమెను సంతోష పెట్టడంలో పెద్దపాపం యేమీ కనిపించదు. ప్రవర్తన హృదయం

వల్ల ప్రబోధింప బడింది. సుందిచెష్టలు, ప్రవర్తన జరిగిపోయిన తరు వాత తాపీగా ఆలోచించే బుద్ధిమీద ఆధారపడింది. అసత్యం చెప్పె నాసరే ఆమెని సంతోషపెట్టమని హృదయంకోరింది; యింద్రియాలు ఆమోదించాయి.

కాని, నాబుద్ధి ఒప్పుకోదు. నన్ను చాలా బాధపెట్టింది. కమల అమాయకత్వం, ఉత్సాహం తల్చుకుంటే, నాఅంత చెడ్డవాడు వుంటాడా అనిపించింది. నాలో నేను సమాధాన పడేందుకు చాలా రోజులు పట్టింది. నేనూ, కమలా, యెన్నడూ కలుసుకోం గదా. కలుసుకున్నా యీ సంభాషణంతా మరిచిపోయి వుండొచ్చు. లేక పోతే, తర్వాత వివాహం జరిగిందని చెప్పొచ్చు. యింటికి రాగానే, నామీద నాకు మరింతకోపం రావడం మొదలెట్టింది. నా భార్య కమలకంటె చక్కంది. యెందుకీ లేనిపోని ఆరాటం. నాఉద్దేశ్యం యేదైనా, అబద్ధంచెప్పడం పొరపాటనడానికి నిదర్శనం — నన్నా విషయం కొన్ని నెలలు బాధించడమే. నన్ను యీపాడు నైతిక దృష్టి అల్లా అవస్థపడేటట్లు తరిఫీదుచేసింది. చేసిన నేరంకంటె పడే బాధ ఎన్నోరెట్లు యెక్కువ.

ఏడాది గడిచింది, అది వేసంగి, నేను నిద్రనుంచి లేచేటప్ప టికి నాలుగు దాటింది. నిద్రనుంచి లేవకపోతే లేవకపోదును రంగడు "ఎవరో వచ్చారండి" అని లేపాడు.

"ఎవరురా ?"

"ఎవరో ఒకాయన మీరుండారా అంటూ గుమ్మంకాడ నిల బడ్డాడండి."

లోపలికెళ్ళి మొహం కడుక్కొని తువ్వాలుతో తుడుచు కున్నా. ఫ్లాస్కులో కాఫీ పోసుకు తాగుతున్నాను. రంగడు గుమ్మంలో నిలబడ్డాడు.

"మీరుండారని చెప్పానండి. ఆ వొచ్చినాయన సందు చివర బండికాడికెళ్ళాడండి. అందులోంచి ఓ అమ్మగారు దిగారండి — అంటే

బండిలోంచి అండి - ఆరు తిన్నంగా వచ్చేసి ముంగల గదిలో కూకు న్నారండి. ఆ వొచ్చినాయన ఓ బుట్టకూడా తీసుకొచ్చారండి. ఆ బుట్టలో మామిడిపళ్ళండి. మళ్ళా ఆయన తిన్నంగా సందులో బండి కాడికెళ్ళాడండి."

" అమ్మగారేరి ?"

" ముంగలి గదిలో కూకున్నారండి "

" ఛా, మనమ్మగారురా"

" అమ్మగారు గుళ్ళోకెళ్ళారు "

ఆ వొచ్చిందెవరు చెప్మా.! గుండెలు వేగంగా కొట్టుకొం టున్నాయి. ఎంతసేపయింది, ఎక్కడున్నారు అనుకుంటూ లేచి వెళ్ళాను. పీధిగదిలో కూర్చుంది కమల. నరాలన్నృత్యం నిలబెట్టే టందుకు గుప్పిడి బిగించుకున్నాను. తేళ్ళ కుటుంబాన్ని మింగినట్టుగా వుంది నాకంఠం.

కమల కింకా జ్ఞాపకంవుంటే మాట - ఎందుకుండదూ వాళ్ళు మిగతా వన్నీమర్చిపోయి తప్పకుండా జ్ఞాపకం వుంచుకొనేది వొక్కటే - నేఆడిన అబద్ధం బయటపడివుంటుంది. ఎందుకంటే బల్ల మీద మా పెళ్ళిఫొటోవుంది. వాడికీర్తి ప్రపంచమంతా ఎక్కడ వ్యాపించదో ' అనే భయంవల్ల కాబోలు ఫొటో తీసినవాడి పేరు, వాడికొట్టుపేరూ, తీసినతారీఖు, నెల, సంవత్సరము పెద్ద పెద్ద అంకెలతో అక్షరాలతో వున్న ఒకఅట్టని ఆఫొటోలోసగం ఆక్రమించే టట్లుగా అడ్డంగా అతికించుకు కూర్చున్నాడు. గోడల్ని మరికొన్ని పటాలున్నాయి.

హిందీఫిలింతారలు, మొదటి కాంగ్రెసు ప్రెసిడెంటు, రవీంద్ర నాథ్ టాగూర్ పటాలు, పొట్టి శ్రీరాములు కాలెండర్ బొమ్మ.

" ఎక్కడనుండి రావడం. ఎంతసేపయింది " అన్నాను.

అటూ, యిటూచూసి ప్రైవేనా పత్రికని తేదీ కనపడకుండా ఆపెళ్ళిఫోటో మీద కప్పాలని బల్ల పైనా, క్రిందా సర్దడం మొదలెట్టాను.

" ఈవూళ్ళో మా పెత్తల్లి వుందిగా. తమ్ముడికి పెళ్ళి సంబంధ ముంటే, పిల్లనిచూడాలని వచ్చాం "

' అలాగా '

వీలుగా మరేపత్రికా, కాగితంకనపడలేదు. అయినాయిప్పుడేం చేసినాలాభంలేదు. ఆఫోటోపైన తేదీని గుర్తించి వుంటుందని నేనెందు కనుకోవాలి? ఒక వేళ గుర్తించినా అది ఆఫోటోగ్రాఫర్ కొట్టు అవతరించిన తేదీగా సమర్థించ కూడదా?

రంగడిని కాఫీతీసుకు రమ్మన్నాను.

' అక్కర్లేదు, యిప్పుడే త్రాగివచ్చా '

' ఫరవాలేదు, కాఫీయెంత - పిల్లనచ్చిందా? '

' వాడికి నచ్చాలిగా '

' మరే. మరే '

' ఇంత తొందరలో కలుసుకుంటామనుకోలేదు ' అనినవ్వింది.

' ఆ, అవును యింత తొందర్లో - మరిభూమి గుండ్రంగా వుంటుందిగా '

' ఈ చీర ఆరోజున కొన్నదే '

' అవునవును, చాలా బాగుంది. ఎల్లాగయినా మీకు చీరల విషయం బాగాతెలును 'అన్నాను ఇదివెనక అన్నమాటే.

' నా పేరుమర్చిపోయారా?,

' లేదు, లేదు...కమల '

' మరి మీరూ అనడం ఎందుకు ? '

ఇద్దరం నవ్వుకున్నాం.

పక్కనున్న బుట్టకేసి చూశాను.

' మామిడి పళ్ళా '

" మామిడి పళ్ళే "

" తెచ్చారా! "

నవ్వింది.

గోడలకేసి నాలుగుమూలలా చూసింది.

" ఈ చీరకూడా చాలా బాగుందే - కమలమ్మ యిక్కడ వుందా ?" అంటూ చిలక్కొయ్యని వున్న ఊదారంగు పట్టుచీర కేసిచూసింది.

ఎంతపని జరగాలో అంతపనీ జరిగింది. చిలక్కొయ్యని నా కోటు పక్క ఆవిడ చీరకూడా తగిలించివుంది. నాకు మా ఆవిడ మీద వొళ్ళు మండింది. ఆ గొప్పచీరని పదిమందీ చూడాలనా. వీధి గదిలో పెట్టడం ? తన చీరలకి ఆ బీరువా, రెండు ట్రింకులూ చాలవూ ! ? తన చక్కదనం చూచుకొంటూ తనవ్యక్తి అలంకర ణలో నిమగ్నురాలైన యిల్లాలు గృహాలంకరణం గురించి పట్టించు కోదని వూరికే అన్నారా పెద్దలు!

" అదా - అబ్బే - కాదు."

"అంటే అది చీరకాదంటారా ?"

"అహా - అది కమలమ్మది - కాదన్నమాట"

ఈసారికూడా అబద్ధంచెప్పి లాభంలేదని తెలుసుగున్నాను. ఎట్లాను తెలియకమానదు - ఆ గాయం ఎల్లానూ తగుల్తుంది. గనుక ముందే సిద్ధపడటం మంచిది.

"నీకు తెలియదేమో - ఈ మధ్య..."

"ఎవరేనా కొత్తచుట్టం ?"

నాకు మరింత కోపంవస్తోంది. మాట్లాడుకోనేందుకు ఎన్నో విషయాలుండగా ఆ చీర విషయం వొక్కటే రెట్టించి అడగడం స్త్రీ దృక్పథం ఎంత యిరుకైందో తెలుపుతుంది.

"అబ్బే ఎవ్వరూ లేరు...నాభార్యది" అని ఆమెకేసి చూడకుండా బల్లమీద గుడ్డనిలాగి వేలుకిచుట్టుకుంటున్నా. ఆమెతన ఆశ్చర్యాన్ని ఎల్లా ప్రకటించిందో చూడలేదు.

'నీకు? భార్య....'అంటూ వేలుని నావైపు చూపింది.

" అందులో విశేషం ఏముంది? "

' నాకప్పుడు చెప్పలేదే! లేదనికూడా చెప్పావు. ఎదురుగుండా ఫొటోవుండగా ఆఫొటో చూసి నిజంతెలుసుకొని కూడా ఏమీ తెలియనట్లు నాచేత చెప్పించి తానుపొందిన వినోదంలో ఎంతకసివుందో! ఈ మధ్యనే కాపరానికి వొచ్చిందంటే కొన్ని చిక్కులున్నాయి. ఈ మధ్యనేకాపరానికొచ్చిన భార్య తాలూకు చీరలు వీధిగదుల్లోకి విరబోసుకురావు. నిజంచెప్పదల్చు కొన్నప్పుడు పూర్తిగా చెప్పడం మంచిది.

' అవును '

'ఏం అవును?'

'అయింది. అయింది.'

"ఎందుకు?"

"అందరి మొగాళ్ళలాగే నాకూను."

'అదికాదు. అప్పుడల్లాగ ఎందుకు చెప్పావు?"

'ఏమో తెలీదు. అల్లా చెప్పాలనిపించింది."

'చిత్రంగావుంది.'

'నీకు తెలుసు'

'నాకేం తెలుసూ?'

రంగడు కాఫీ కప్పులు టేబిల్ మీద పెట్టాడు. కమల తాగనంది. "పోనీ మామిడిపళ్ళు కోసిపెట్టనా" అని బుట్టనాకేసి లాగాను. ఆ బుట్టని తనకేసి లాక్కుంది. కిళ్ళీలు పట్టుకురమ్మని రంగడిని పంపించివేశాను. ఆమె లేచి గుమ్మంవేపు కుర్చీలో కూర్చుంది. ఆమెకి కోపం వొచ్చేసింది. అసూయతో మిళితమైన వొకమంట చెలరేగినట్లు కళ్ళు పదేపదే మూస్తోంది. రక్తం ఎరుపుతో ఆమె చెక్కిళ్ళు మెరిశాయి. చెలగాటం సహించని ఆమె కనుబొమ్మలు ముడుచుకొని నుదిటిమీద చర్మాన్ని కిందికి లాగుతున్నాయి. తనని వొక్కదాన్ని చేసి నేను నా భార్య కలసి మోసగించామని అనుకొంటోంది కాబోలు!

"ఆ ఫొటోలో, ఆమే..." అన్నాను.

"తెలుస్తూనే వుంది. నువ్వు నాతో ఆడిన అబద్ధానికి లోపల ఆనందిస్తున్నావనుకుంటా..." ఆ వాక్యంలో ఎంతో వెక్కిరింపు. ఈర్ష్య యిమిడ్చింది; కొన్ని నెలలు బాధపడి వుండటంవల్ల నేను దాని

కంతా సిద్ధపడే వున్నాను. నాటకంలోకి పాత్రని చూస్తున్నట్లు చూస్తున్నా నామెను.

"నువ్వట్లా అనుకోకూడదు. ఆ సమయంలో ఏదో అల్లా అనేశాను. నాకెందుకర్ధం కాదు ?"

"భలేగా చేశానని లోపల గర్విస్తున్నారనుకుంటా, నువ్వూ మీ ఆవిడాను"

"ఇందులోకి దాన్ని దించకు."

"అబ్బో...భార్య మాటంటే ఎంత పౌరుషం-ఎంత రోషం !"

"అబ్బ, వొద్దు కమలా ! నన్నను. నేను సిద్ధంగా వున్నా. దాన్నివొద్దన్నాను. అంతే, దానికేమీ తెలియదు."

"నాదగ్గరే అబద్ధం ఆడినవాడవు నీ భార్యముందు ఆడకుండా వుంటావేమిటి ? నన్ను చేసిన మోసానికి సంతోషించ నక్కరలేదు. యిల్లా నాలుగబద్ధాలు నేర్పావంటే నిన్నూ యిల్లాగే అబద్ధాలతో మోసంచేస్తుంది"

నా కీవిషయం చాలా బాధకలిగించింది. కమలకి నామీద యింత స్వతంత్రం రావడానికి కారణం నా అబద్ధంకదా ! స్త్రీలకి చనువిస్తే- నే చెప్పక్కర్లేదు అందరికీ అనుభవమే.

"అట్లాంటివనకూడదు. కమలానన్ను క్షమించమంటున్నాను."

కాని, నేను అడకువ. నమ్రత చూపినకొద్దీ కమల కసి మరింత ౹క్కువవుతోంది. నేను కొంచెం బింకంగా, పెంకిగా, సమాధానం క్తే?"చదువుకున్నవాడవు కుటుంబీకుడవు యిట్లాంటిఅబద్ధాలతో...'

'చాలా శ్రమపడ్డావు. కాఫీత్రాగు,' అన్నాను ఆమెవాక్యం పూర్తి అవనీకుండా.

ఎందుకో నాహాస్యసృష్టి పరిగెత్తుకుంటూ నా పెదవుల మీద ప్రాలింది. ఆనవ్వు తుఫానుముందు పిడుగు.

కమల లేచింది. కుర్చీలు అప్ సర్దుతో నేనూ నుంచున్నాను.

" నువ్వే యీపని చేశావని నవ్వక్కరలేదు. పాపం, నీ కొక్కడికే పెండ్లయిందనుకుంటున్నావు కాబోలు! నాకూ పెండ్ల యింది. నీకు ఏడాదిక్రితమే అయితే నాకంతకిముందే అయింది. నువ్వు అల్లా ఎందుకు అబద్ధం ఆడావో నేనూ అందుకే ఆడాను! సరా? నాకూవొస్తోందినవ్వు. కాని నీఅంత బిగ్గరగా నవ్వలేనులే..."

నన్నేమీ సమాధానం చెప్పనీయకుండానే వెళ్ళిపోయింది. చేతైనప్పుడు ఏడ్పు, చేతకానప్పుడునవ్వు, అంటూ గొణగడం విన పడింది. నేనూవెనకాలే బయల్దేరాను. రంగడు కిళ్ళీలు తెచ్చాడు. ఆమెవెళ్ళి బండిలోకెక్కింది. నేను ఆశ్చర్యంతో కదలలేకపోయాను. నాలోబరువు తగ్గింది. నా అసత్యపాపాన్ని పంచుకునేందుకు స్నేహితులున్నారు. నేను అనుకున్నంత చెడ్డవాడిని కాదేమోనని పించింది. అందరూ అంతే ననుకుంటాను. ఇట్లాంటి సత్యం తెలుసు కోడంకోసం అబద్ధం ఆడితేనేం: కమలపై నాకుకోపంలేదు. కోపం

వచ్చిన స్త్రీపై పగసాధించడానికి చాలా అభ్యంతరాలుంటాయి. కాని క్షణ క్షణమూ ఆమె పెద్దదై ముదుసలిగా మారుతోందని వూహించుకొని తృప్తిపడటానికి ఏ ఆటంకమూ వుండదు. వీధి చివరకి చూశాను. మా ఆవిడదూరంగా తలవొంచుకుని గుడినుంచి వొస్తోంది.

రంగడిని మామిడిపళ్ళ బుట్టని బండిలో యిచ్చేసి రమ్మని నేను లోపలికి వచ్చేశా. భార్య తనంతట తాను ఎల్లానూ తెలుసుకుంటుందని నిర్ధారణ అయినప్పుడు, భర్త ఆవిషయం యితరులు చెప్పేముందు భార్యతో తనే చెప్పివెయ్యడం శ్రేయస్కరమేమో!